అఖిల భారత కాంగ్రెస్ సమావేశం.

Regd. No. M. 3824

# నవశక్తి

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ పత్రిక

సంపాదక వర్గం : మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు). కంభంపాటి సత్యనారాయణ. పుచ్చలపల్లి సుందరయ్య. తుమ్మల వెంకట రామయ్య.

సంపుటం 1 } బుధవారము 28—9—38 బెజవాడ { సంచిక 40

## ‘హిందూ ముస్లిం సమస్య’




దీనికి మూలకారణం ఎవరు?

—నేషనల్ ఫ్రంటు నుండి.

# నవశక్తి


చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 3—0—0 |
| అర్ధసంవత్సర చందా | 1—10—0 |
| విడిప్రతి | 0—1—0 |

* * *

అడ్వర్టైజుమెంటు రేటులు

"కాలం" వెడల్పు 2" (2 అంగుళాలు) కాలంలో 1" మొదలు 20" వరకు ప్రతి

| | |
|---|---|
| అంగుళానికి రూ. | 0—6—0 |
| 20"—100" వరకు .. | 0—4—0 |
| 100" పైగా .. | 0—3—0 |
| పాతిక పేజీకి | 3—0—0 |
| సగము పేజీకి | 6—0—0 |
| ఒక పేజీ మొదలు 15 పేజీల వరకు పేజీ ఒకటికి | 10—0—0 |
| 15 పేజీలకు పైగా పేజీ 1కి | 7—8—0 |

ఈ వరకు అంగీకరించిన కంట్రాక్టు లకు ఈ రేట్లు వర్తించవు.

ఈ రేట్లలో కన్సెషన్సు, కమిషన్సు ఏమీ ఉండవు.


* * *

చందాదారులను చేర్పించాలి:

సెప్టెంబర్‌లో ఈ క్రింది విధంగా జేర్పించాలని క్రొత్తగా మరో లిస్టు ఇచ్చినాం. ఈ "కోటా"లు పూర్తి అయేటట్లు పార్టీ సభ్యులు, సోషలిస్టు అభిమానులు, ప్రజా సామాన్యము పని చేస్తారని ఆశిస్తున్నాం.

ముఖ్యంగా పార్టీ సభ్యులు తీవ్రంగా పనిచేసి 'కోటా' పూర్తి చేస్తారని నమ్ముతున్నాం.

సెప్టెంబర్ నెల రెండు వారాలలో

| | కోటా | చేర్పించినది |
|---|---|---|
| విశాఖపట్టణము | 10 | 2 |
| తూ. గోదావరి | 75 | 7 |
| ప. గోదావరి | 90 | 39 |
| కృష్ణా జిల్లా | 100 | 55 |
| గుంటూరు | 60 | 4 |
| నెల్లూరు | 50 | 16 |
| రాయలసీమ | 10 | 2 |
| ఇతరస్థలాలు | 5 | 12 |
| | 400 | 137 |

# వార్తా లహరి

## గాంధీ జయంతి

మహాత్ముని 70 వ జన్మ దినోత్సవం సందర్భంలో ఈ నెల 21 వ తేదీని దేశమంతటా ఉత్సవాలు, ఊరేగింపులు, సభలు జరిగాయి. ఢిల్లీలో జరుగ నున్న అ. భా. వర్కింగు కమిటీకి గాంధిగారు వెళ్లి నప్పుడు చుట్టుపట్ల నుండి గ్రామస్థులు తండోప తండములుగా వచ్చి, సాయంకాలపు ప్రార్థనలో పాల్గొన్నారు. హరిజన వాడలో సమావేశమైన వారు మొత్తం 5,000 మంది వరకు ఉంటారు. వారిలో 1000 మంది సాయంత్రపు ప్రార్థనలో పాల్గొన్నారు. హరిజనవాడ నివాసులు కూడా ఆయనకు ప్రీతికరములైన నూలు వడకు పోటీ, బియ్యపు దంపుడు పోటీలను నడిపించారు. విరామం లేకుండా 24 గంటలు జరుప బడింది.

బొంబాయి నగరంలో కాంగ్రెసు ప్రచారకులు దళములు దళములుగా వీధులలో ఊరేగి, కాంగ్రెసు సభ్యులను చేర్చి, ఖద్దరు విక్రయం చేశారు. కాంగ్రెసు కార్యాలయంలో ఉత్సవం, కార్య క్రమం, జాతీయ పతాకోత్సవంతో ప్రారంభ మయింది. బొంబాయి షేర్ మార్కెట్టు, మార్వాడీ బజార్, పత్తి వ్యాపారం సంస్థ, ధాన్యపు వర్తక సంఘం మొదలైన 25 సంస్థలు మూసివేయ బడ్డాయి. సాయంకాలం అనేక బహిరంగ సభలు జరిగాయి. బొంబాయి కాంగ్రెసు కమిటీ వారి యాజమాన్యమున జరిగిన ఖద్దరు స్వదేశీ ప్రదర్శమునకు ప్రభుత్వపు రెవిన్యూ మంత్రి మురార్జీ దేశాయి గారు ప్రారంభోత్సవం జరుపుతూ, గాంధీగారి సందేశాన్ని గురించి ఉపన్యసించారు.

ఢిల్లీ మండల కాంగ్రెసు కమిటీ యాజమాన్యమున జరిగిన బహిరంగసభలో మహాత్ముని దీర్ఘాయురారోగ్యములను, సంపూర్ణ స్వాతంత్ర్య ప్రాప్తిని ఆశిస్తూ తీర్మానాలు చేయబడ్డాయి.

కలకత్తాలో, అ. భా. చర్ఖా సంఘ కార్యాలయమందు మహాత్ముని 70 వ జన్మ దినోత్సవం, పతాక వందనోత్సవం జరిగింట.

శాంతి నికేతనంలో శ్రీ రవీంద్రనాధ టాగూర్‌గారు విద్యార్థి బృందము యెదుట గాంధి మహాత్ముని ఉన్నతాదర్శములను గురించి ఉపన్యసించారు.

ఇదే విధంగా మదరాసు, బెజవాడ, గుంటూరు, ఏలూరు, కాకినాడ, రాజమండ్రి మొదలైన పట్టణాల్లో గాంధీ జయంత్యుత్సవాలు జరిగాయి.

## బెంగాల్‌లో వరదలు

బెంగాల్‌లో మొత్తం 13 జిల్లాలల్లో నదులు పొంగి వరద లొచ్చి అనేక గ్రామాలకు నష్టం వచ్చింది. అఖాలీ జిల్లాలో, లాక్ష్మర్ ఠాణాకు చెందిన గ్రామా లన్నిటిలోను 25,000 పశువులు నదులలో పడి కొట్టుకొని పోయాయి. 25 లక్షల విలువగల ఆస్థికి నష్టం వచ్చినది. సాత్ఖిరాలో 400 చదరపు మైళ్ళు నీటిలో మునిగి సముద్రం వలె తయా రైంది. ఫరిద్‌పూర్ జిల్లాలో 6 లక్షల మంది ప్రజల యిండ్లు, పంటలు వగైరా ధ్వంసమయాయి. నాడియాలో కూడా 3 లక్షల మంది యీ స్థితికి వచ్చారు. ఢక్కా జిల్లాలో మున్షీగంజ్, మణిక్‌గంజ్ అనే రెండు సబ్‌డివిజన్లలో గ్రామాలన్నీ నీటిలో మునిగి యున్నాయి. కలరా, ఇన్‌ఫ్లుయంజా, మలేరియా వ్యాధులుకూడా అప్పుడే ప్రారంభమయాయి.

ప్రభుత్వం వా రిస్తున్న స్వల్ప సహాయం ఏమాత్రమూ సరిపోవడం లేదు. కాంగ్రెసు కమిటీలే యీ ప్రజల సహాయార్థం ధనం వసూలు చేసి, పంచిపెట్టుతున్నారు. ఇది కూడా సరిపోక, అనేక మంది ఆకలి బాధకు ఓర్వలేక, ఆత్మహత్యలు చేసుకుంటున్నారు.

## పెర్షియాలో వరదలు

పెర్షియా దేశంలో కూడా యిదే ధోరణి. నదులు పొంగి అనేక గ్రామాలు నీటిలో మునిగిపోయాయి. కొన్ని వందల మంది జనం ప్రవాహాలలో పడి చనిపోయారు. 200 మంది శవాలను యింత వరకు ప్రభుత్వోద్యోగులు పట్టు కున్నారు. నహావెండ్ అనే నగరం యించు మించు పూర్తిగా ధ్వంసమైంది. అక్కడి ప్రభుత్వ భవనాలన్నీ కూలి పోయాయి.

## అమెరికాలో తుపాను

అమెరికా యందలి అనేక రాష్ట్రాలలో నదులు సముద్రం పొంగి, తుపాను చెలరేగి, ఆనకట్టలు వంతెనలు వగైరాలు కూలి పోయాయి. 127 గురి శవాలను పట్టు కున్నారు. అందమైన సముద్ర తీరములన్నీ పాడైనాయి. అనేక లక్షల డాలర్ల విలువ గలిగిన ఆస్థులు నష్టమయాయి. తుపాను ఆగి పోగానే సముద్రములోను, నదులలోను విపరీతమైన అగ్ని జ్వాలలు బయలు దేరాయి.

## రహస్య పరిశోధనాలయం

రాజమండ్రిలో ఉన్న గవర్నమెంటు రహస్య పరిశోధనాలయపు శాఖ యీ నెల 12 వ తేదీ నుంచి బెజవాడకు మార్చబడింది. భగవాన్‌సింగ్ అనే ఆయన ఆఫీసు ఇన్‌ఛార్జిగా నియమింపబడ్డారు.

## ఉచిత సినిమా ప్రదర్శనం

మదరాసు యందలి సినీమా థియేటర్లలో ఉచిత ప్రదర్శనాలు ఈయబడ్డాయి. గెయిటీ థియేటర్‌లో "వనరాజ్ కర్జాన్" అనే ఫిల్ము ప్రదర్శింపబడుతోంది. తండోప తండములుగా ప్రజలు వెళ్ళారు. కాని లోపల ఖాళీ పూర్తి అయి, మిగిలిన వారికి స్థలం లేదు. దీనితో ప్రారంభ మయాయి, తోపుళ్లు, తొక్కుళ్ళు. మూసి ఉన్న గేటును జనం బలవంతంగా గెంటారు. గేటు తెరువబడింది గాని అనేకమంది నలిగి క్రింద పడిపోయారు. 24 గురికి గాయాలు తగిలాయి. 25 సంవత్సరముల వయస్సుగల ఒక స్త్రీ మరణించింది.

## రాయలసీమలో కరవు నివారణ పనులు

బళ్లారి, అనంతపూర్, కర్నూల్ జిల్లాలలో కరువు ప్రారంభమైనప్పటి నుంచి యింత వరకు మదరాసు ప్రభుత్వం చేసిన పనులను గురించి వివరిస్తూ ప్రభుత్వ ప్రకటన ఒకటి వెలువడింది.

బళ్లారి జిల్లాలో మొత్తం 16 స్థలములలో కరవు నివారణ సంస్థలు, ఒక టెస్ట్ వర్కునూ స్థాపించబడ్డాయి. ఆగస్టు 31 లో టెస్ట్ వర్కు మాత్రం మూసివేయ బడింది. సెప్టెంబర్ 3 వ తేదీ నాటికి జిల్లాలో మొత్తం 46,004 మంది రిలీఫ్ పనులలో నియమించబడి యున్నారు. 4,142 గురు చేనేత పారిశ్రామికులకు కూడా గవర్నమెంటు పనులు కల్పించి, సహాయం చేసింది.

ఈ మూడు జిల్లాలలోను కరవు నివారణ పనులకై పెట్టుబడికిగాను ప్రభుత్వం మొత్తం 3½ లక్షల రూపాయల ఋణం యిచ్చింది. సెప్టెంబర్ 3 వ తేదీ నాటికి బళ్లారి జిల్లాలో ఉచితంగా భోజన సౌకర్యాలు పొందిన వారి సంఖ్య 18,914.

అనంతపూర్ జిల్లాలో మొత్తం 6 స్థలాలలో కరవు నివారణ సంస్థలు స్థాపించ బడ్డాయి. సెప్టెంబర్ 3వ తేదీ నాటికి జిల్లాలో 16,397 మంది రిలీఫ్ పనులలో నియమించబడి యున్నారు. 521 మంది చేనేత పారిశ్రామికులకు కూడా పనులీయ బడ్డాయి. సెప్టెంబర్ 3 వ తేదీ నాటికి 14,179 మందికి ఉచిత భోజన సదుపాయములు చేయ బడ్డాయి. జిల్లాలో, మొత్తం 27,025 రూపాయల ప్రభుత్వపు ఋణం వినియోగింపబడింది.

కర్నూల్ జిల్లాలో 4 చోట్ల క్షామ నివారణ సంస్థలు, ఒక చోట టెస్ట్ వర్కు స్థాపించ బడ్డాయి. ఆగస్టు 10 వ తేదీని టెస్ట్‌వర్కు మాత్రం మూయ బడింది. సెప్టెంబర్ 3 వ తేదీ నాటికి ఉచితంగా సహాయం పొందే వారి సంఖ్య 2,734. 93,280 రూపాయల ప్రభుత్వ ఋణం యీ జిల్లాలో వినియోగించ బడింది. మెట్ట భూములపై వసూ లగుచున్న రూ. 2,734,198-8-0 భూమి పన్నుకు రెమిషన్ ఈయబడింది. రూ. 39,195-8-0 పన్ను వచ్చే ఫసలీకి వాయిదా వేయ బడింది.

బళ్ళారి జిల్లాలో గత వారం మొత్తం 70,040 మందికి రిలీఫ్ ఈయబడింది.

అనంతపూర్ జిల్లాలో కలరా కూడా వ్యాపిస్తోంది. కొంతమంది చనిపోయారు. మ్యునిసిపాలిటీలు శ్రద్ధ తీసుకొని, టీకాలు వేయిస్తున్నారు.

## రంగూన్ అల్లర్లు

రంగూన్ అల్లరులను గురించి సమగ్రమైన విచారణ జరుపుటకు బర్మా గవర్నమెంటు ఒక విచారణ కమిటీని నియమించింది. దానిలో యిద్దరు బర్మన్లు, యిద్దరు భారతీయులు, జస్టిస్ బ్రాండ్ అనే ఒక హైకోర్టు జడ్జీ ఉన్నారు.

ఈ అల్లరులకు కారణమైన "మౌల్వీ-యోగి-సదన్" అనే గ్రంథమును వ్రాసిన యూ-షే-పీ అను అతనిని ప్రభుత్వం అరెస్టు చేసి, విచారణ ప్రారంభించింది.

రంగూన్ నుంచి తిరిగి వచ్చే భారతీయులకు ఉచిత రైల్వే సదుపాయములకై మదరాసు ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వ సభ్యులతో సంప్రతిస్తున్నట్లు రూఢియైన వార్తలు వస్తున్నాయి. మొన్న 19 వ తేదీని విశాఖపట్నం హార్బరుకు వచ్చిన ఓడలో 190 మంది భారతీయులు, రంగూన్ నుండి తిరిగి వచ్చిన వారు దిగారు,

## మనవి

దసరా సెలవు లగుటచే వచ్చే వారం పత్రిక వెలువడదు. మళ్ళీ 12 వ తేదీనే ప్రచురణ.

అక్టోబర్ 10 వ తేదీ "చైనా రిపబ్లిక్" వార్షికోత్సవ దినం. అందుచే 12 వ తేదీన వెలువడే సంచికను "చైనా ప్రత్యేక సంచికగా" ప్రచురిస్తాం.

—సంపాదకుడు

28—9—38 బుధవారం

# ఎ. ఐ. సి. సి—ఫెడరేషన్

ప్రపంచ వాతావరణం భయంకరంగా ఉంది. యుద్ధ మేఘాలు ప్రపంచశాంతిని భగ్నపఱుచుతున్నాయి. జకోస్లొవేకియా సమస్య క్లిష్టంగా ఉన్నది. బ్రిటిష్ ప్రధాని ఛాంబర్లేను హిట్లర్‌కు జక్‌ను బలిగావించి తాత్కాలికంగా ప్రపంచ యుద్ధం ఆపినా, లేక ఈసమస్యపై ప్రపంచ యుద్ధం సంభవించినా, పరిస్థితులు భీషణంగానే ఉంటాయి.

ఇట్టి క్లిష్ట—సందిగ్ధావస్థలో సమావేశమైనది అఖిల భారత కాంగ్రెసు కమిటి. హరిపూర్ కాంగ్రెస్ సమావేశానంతరం ఇదే అఖిల భారత కాంగ్రెసు సభ్యుల ప్రథమ సమావేశం. ఈ సమావేశం ఎంతో ప్రాముఖ్యమైనదే గాకుండా, చారిత్ర్యాత్మకమైనదని చెప్పవలసి ఉంటుంది.

బ్రిటిష్ సామ్రాజ్యం యుద్ధ ప్రయత్నాలు గావించుతోంది. ప్రపంచ శాంతికి మూలకందమైన రష్యాను దిగమ్రింగటానికి ప్రయత్నించుతున్నది. అందుకే హిట్లర్‌తో ఈ గుస గుసలు — జకోస్లొవేకియాని బలి గావించే ప్రయత్నాలు— ఫ్రాంసును రష్యానుండి విడదీసే పన్నాగాలు. బ్రిటిష్ పెట్టుబడిదారుల ఆశా పిశాచానికి మరో ప్రపంచ యుద్ధం అవసరం. అందుకే ఫాసిస్టు యుద్ధ పిపాసులకు, బ్రిటిష్ పెట్టుబడిదారుల ప్రతినిధి ఛేంబర్లేన్ చేయూత నిచ్చేందుకు ప్రయత్నిస్తున్నాడు.

ప్రపంచ యుద్ధమే ప్రారంభమయితే హిందూ దేశాన్ని ఉపయోగించుకోవాలని బ్రిటిష్ సామ్రాజ్య వాదుల కోరిక. ధన మనుష్య సహాయాన్ని ఇష్టం వచ్చినట్లు దోచుకోవాలని బ్రిటిషు సామ్రాజ్య వాదం యొక్క ఆవేదన. ఈ పని కొన సాగాలంటే ఇది వరకున్న రాజ్యాంగ చట్టం జాలదు. ఫెడరేషన్ అనే పెను భూతాన్ని మన నెత్తిన రుద్దితే గాని, బ్రిటిషు సామ్రాజ్య వాదపు దోపిడి, యుద్ధ సమయాల్లోనూ, ఇతర సమయాల్లోనూ, విరివిగా కొనసాగదు. అందుకని తమ శాయశక్తులా, ఫెడరేషన్‌ను అమలు పఱచడానికి బ్రిటిషు సామ్రాజ్యం ప్రయత్నిస్తుందనడానికి ఏమీ సందేహం లేదు.

ఫెడరేషన్ విషయమై భారతీయుల దృఢ నిశ్చయం ఏమీ మారలేదు. దేశమంతటా, మొన్న 16—18 వ తేదీలలో సోషలిస్టుల ప్రోద్బలంచేత ఫెడరేషన్ ప్రతికూల సభలు జరిగాయి. హరిపూర్ కాంగ్రెస్‌లో ఫెడరేషన్ ప్రతికూల తీర్మానం జరిగింది కదా, ఇపుడు మరల ఆ గొడవ ఎందుకు అని ప్రశ్న రావచ్చును. నిజమే-దీనికి కారణము లేక పోలేదు. ప్రపంచ పరిస్థితులు దిన దినమూ మారుతున్నాయి. హరిపుర కాంగ్రెస్ సమావేశానంతరము దేశములో అనేక ఘటనలు జరిగినాయి. వాటిని పురస్కరించుకొనే ఇప్పుడీ తీర్మానం చేయవలసి వచ్చినది.

కాంగ్రెసుకు మెజారిటీ ఉన్న రాష్ట్ర శాసన సభలలో ఫెడరేషన్‌ను ప్రతిఘటించుతూ కొన్ని చోట్ల తీర్మానాలు గావించబడినాయి. కాని, అవి అంత తేట తెల్లంగా లేవు. ఫెడరేషన్ రుద్దితే ముందు ఏమి చేస్తామో, ఆ తీర్మానాలు తెలియచేయ లేదు. ఫెడరేషన్‌ను మనపై బలవంతంగా అమలు పరిస్తే ప్రజలు ఏమి చేయాలో కూడా అవి తెలియజేయ లేవు. ఇక ఫెడరేషన్ కూడా అమలు పరచి చూద్దాం, అనే సత్యమూర్తి ప్రసంగాలు రోజు రోజూ వృద్ధి అవుతూనే వచ్చాయి. భూలాభాయి లండన్ ప్రయాణము—తర్వాత ఆయన లండన్‌లో ఏదో మెత్తబడినాడని విని సుభాస్‌బోస్ గర్జించడం, మన మెరిగిందే. ఒక ప్రక్క "వైస్రాయి తన ప్రత్యేక అధికారాలు వినియోగించడు—కాంగ్రెసు మంత్రులు తమ పరిపాలనను బాగానే చేస్తున్నారు—ఫెడరేషన్ కూడా అమలు జరిపి చూడండి." అని బ్రిటిష్ రాజనీతిజ్ఞులు మితవాదులకు ఆశ జూపుతూనే, మరో ప్రక్క ఫెడరేషన్‌లో ఎట్టి మార్పులూ చేయబడవని ఘంటా పథంగా చెప్పడం కూడా మన మెరిగినదే. వైస్రాయి, మరి అర్గురు గవర్నర్లతో సహా సెలవుకై లండన్ వెళ్ళి, ఇండియా మంత్రితో ఆలోచనలు గావించుతున్న సంగతి కూడ మనకు తెలియంది గాదు. అందుచేతనే, బ్రిటిష్ సామ్రాజ్యం యుద్ధానికి సన్నద్ధ మవుతున్న ఈ సమయంలో: సైనిక బిల్లులతో మన నోళ్ళు కట్టివేయడానికి చూస్తున్న ఈ సమయంలో: మనల ఏవిధంగానయినా—నయాన—భయాన—ఫెడరేషన్‌ను అమలు పరిచేందుకు అంగీకరించడానికి ప్రయత్నించుతున్న ఈ సమయంలో: ఢిల్లీలో సమావేశమైన అఖిల భారత కాంగ్రెస్, ఫెడరేషన్ ప్రతికూల తీర్మానం మరోసారి గావించడం ఎంతో అవశ్యం.

వర్కింగు కమిటీయే ఈ తీర్మానాన్ని ఉపపాదించినందులకు సంతోషిస్తున్నాము. ఇదివరకు జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశాలలో "ఇపు డా తీర్మాన ఆవశ్యకత ఏమిటి?" అని, త్రోసిపుచ్చారు. కాని నేడు కూడ ఆ నిర్లక్ష్యభావమే చూపనందులకు మరోసారి వర్కింగ్ కమిటీ నభినందిస్తున్నాము.

కాని, క్లిష్ట పరిస్థితులలో నున్న ఈ సమయానకూడ వర్కింగ్ కమిటీ 'లీడ్' ఈయలేక పోయినందులకు విచారము. ఇంతే గాదు, ఫెడరేషన్‌పై తీర్మానములోని చివరి పేరా 'సందేహానికి' తావు నిస్తున్నది. ఆ పేరా ఇది.

"కేంద్రంలో బాధ్యత లేని ప్రభుత్వాన్ని ఇంకా కొన సాగించడం, సహింపరానిదౌతున్నది. ఇంకా అలా కొనసాగిస్తే, ప్రతిష్ఠంభన (Crisss) చేయవలసి వస్తుంది. (సాధ్యమైతే ఆ ప్రతిష్టంభనను రానీయ కూడదనే వాంఛ)."

కేంద్ర ప్రభుత్వం మీద ఇంత ఆసక్తి చూపవలసిన అవసరం ఇపుడేమి వచ్చింది? మనకు 1935 నూతన రాజ్యాంగములో ప్రసాదింపబడే కేంద్ర ప్రభుత్వం అయినా, ఫెడరేషన్ అయినా రెండూ ఎదుర్కొన దగినవే. అందుచేత బాధ్యత లేని ఈ పాత కేంద్ర ప్రభుత్వానికి లొంగి ఉండమని కాదు. ధైర్యంగా ప్రతిష్టంభన తెస్తామని చెప్పాలి, కాని "మేము ప్రతిష్టంభన కోరడం లేదు. ఒక వేళ తప్పదేమో" అని నంగి నంగిగా చెప్పడం 'డిప్లొమసీ' అని అంటారేమో గాని, ధైర్యాన్ని మాత్రం చాటడం లేదు. అనుమానానికి కూడ తావిస్తున్నది. అందుకనే ఈ పేరాని రద్దు చేసి ప్రత్యక్ష పోరాటానికి మార్గం సూచించే సవరణలను సోషలిస్టులు, కమ్యూనిస్టులు, రాయ్, ప్రతిపాదించారు. సవరణ లన్నీ ఓడిపోయాయి. ఇందుకు కొంత నిరుత్సాహం పడాల్సి వస్తున్నది. వర్కింగ్ కమిటీ మరోసారి, నాయకత్వం వహించి కార్య క్రమము ఈయలేదే యని, ఇతరులు ఇచ్చిన కార్యక్రమాన్ని త్రోసిపుచ్చిందే యని, విచారించవలసి వస్తుంది.

దేశాయి గారు సోషలిస్టులకు ఇచ్చిన సమాధానం కూడా మరింత అనుమానానికే తావిస్తుంది.

"పోరాటం లేకుండానే, కాంగ్రెస్ తన ఆశయాన్ని పొందగల్గితే తప్పేమిటి" అని అంటున్నా డీయన.

పోరాటంలేకుండా అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు స్వరాజ్యం ప్రసాదించడానికి, బ్రిటిష్ సామ్రాజ్య వాదు లంత బుద్ధిహీనులు కారు. అంతర్జాతీయ పరిస్థితుల వలన బలహీనమైన బ్రిటన్. తనంతకు తానే లొంగిపోతుం దనుకోడం కన్న తెలివి తక్కువ మరేమీ లేదు. ఈనాడు భూలాభాయి సత్యమూర్తులతో సరస సల్లాపాలాడే ప్రభుత్వం, సమయం వస్తే గాంధి—నెహ్రూ—బోసులను జైళ్ళలోకి నెట్టుతుందనీ, మారణ యంత్రాలతో ప్రజా పోరాటాన్ని అరికట్ట ప్రయత్నిస్తుందనీ మనం మఱచిపోగూడదు.

ఎపుడో, బ్రిటిష్ సామ్రాజ్య వాదం ఫెడరేషన్ రుద్దినపుడు—మన కార్యక్రమం ఆలోచించడం కంటె, దాని నెదుర్కొంటానికి నేటినుండే ప్రయత్నించాలి. ప్రజలను తయారు చేయాలి, అలాంటి 'లీడ్' ఈయలేదు నేడు వర్కింగ్ కమిటీ.

అయినా మన కర్తవ్యం ఒకటే. ఫెడరేషన్ ప్రతి ఘటించడానికి దేశమంతటా ప్రబోధించడానికి, రాష్ట్ర, జిల్లా, ప్రైమరీ కాంగ్రెసు కమిటీలు పూనుకోవాలి. యుద్ధం వస్తే, బ్రిటన్‌కు సహాయం చేయమని ఖచ్చితంగా నేటి నుండి ప్రచారం గావించాలి. ఒక వేళ, బ్రిటన్ ఫాసిస్టుల నెదుర్కొంటూ, రష్యా, జక్‌ల తరపున పోరాడినా కూడా, మన కర్తవ్యము ఒక్కటే. శాంతి స్థాపనకు—ప్రపంచ శాంతి సంస్థాపనకు సైతం—పరాధీన భారత దేశం గాదు సహాయం చేసేది—స్వాతంత్ర్య భారత దేశమే.

సామ్రాజ్య వాద యుద్ధాలు నశించాలి!
ఫెడరేషన్ నశించాలి!!
కాన్‌స్టిట్యూయంటు ఎసెంబ్లీకీ జై!!!



# విద్రోహుల చేత జిక్కిన పత్రికా విలేఖరి పాట్లు

## స్పానిష్ విద్రోహుల బందికానాలలో స్వాతంత్ర్య వీరుల అగచాట్లు

[ఆర్థర్ కోయిస్లర్ ఇంగ్లండు నుండి "న్యూస్ క్రానికల్" పత్రికా విలేఖరిగా స్పెయిన్ యుద్ధరంగానికి పోయాడు. విద్రోహులితనిని కమ్యూనిస్టు అని అనుమానించి 'మాలాగా' పట్టణంలో అరెస్టు చేశారు. జైలులో ఇతనిని చంపివేయడానికి ప్రయత్నాలు జరిగాయి. కాని బ్రిటిషు వాడవడంచేత, అదైనా ఎంతో ప్రయత్నం మీద బ్రతికి బయిట పడ్డాడు. తిరిగివచ్చి నాన్ ఇంటర్వెన్షన్ కమిటీ ముందు తాను చూచిన విద్రోహ దురంతాలన్నిటిని గూర్చి పెద్ద సాక్ష్యం ఇచ్చాడు. యుద్ధరంగంలోని తన అనుభవాలు, స్పెయిన్‌లోని నిజ పరిస్థితులు అన్నీ "స్పానిష్ టెస్టమెంట్" అనే గ్రంథంగా వ్రాశాడు. ఇది అందులో ఒక భాగం. —సంపాదకుడు]

౧

"అందులో పడి చావు" అంటూ నాతోకూడా సెల్ (ఖైదుకొట్టు) వరకూ వచ్చిన మిలిటరీ ఆఫీసరు వీపుమీద ఒక్క చరుపు చరిచాడు. ఆ చరుపు ఆపుకోలేకపోయాను. ఆ చీకటి కొట్టులో బోర్ల పడిపోయాను. అంత గట్టిగా చరిచి, వెనక్కైనా తిరిగి చూడకుండా చక్కాపోయాడు.

జైలువార్డరు, తుప్పు పట్టిపోయిన ఇనుప తలుపును బలవంతాన మూసి తాళం వేస్తున్నాడు. మెల్లిగా లేచి తలుపు దగ్గరకు వచ్చి "ఈ బంధింపబడిన వారందరూ రేపో మాపో జీవితాలు చాలించ వలసినదేనా" అని అడిగాను. "ఔను. వాళ్ళంతా కమ్యూనిస్టులు", అని, గేటు తాళంవేసి పోతూ నాకేసి చూసి, భుజాలు పైకి మిటకరించి, ఒక విషపు నవ్వు నవ్వి "రెండు మూడు రోజులలో నీ గతీ అంతేలే!" అని వెళ్ళిపోయాడు.

ఒక తుప్పు పట్టిపోయిన ఇనుప మంచం తప్ప ఆ గదిలో ఇంకేమీ లేవు. దాని మీద గడ్డి పరుపు కూడా లేదు. భరించరాని దుర్వాసన గది నంతటినీ ఆవరించివేసింది. కారణం ఏమిటా అని పరిశీలించడం ప్రారంభించాను. మంచం ప్రక్కనే నెత్తురు పేరుకుపోయి ఉంది. అందులో మాంసపు కండలు కూడా వున్నాయి. ఏ దురదృష్టవంతుడో .... దగ్గరకు పోయి వాసన చూశాను. డోకు వచ్చింది. ఆపుకోలేకపోయాను. వెళ్ళబోసుకున్నాను. వాసన భరించలేక తల దిమ్మెక్కిపోయింది. నిద్దర వచ్చేసింది. ఆ పట్టి ఇనుప మంచం మీదనే కూలబడ్డాను. చలి ఎముకలు కొరికివేస్తోంది. కాని ... నిద్దురకు సౌఖ్యం తెలియదు.

౨

నాకు మెలకువ వచ్చేసరికి నే నెక్కడున్నానో జ్ఞాపకం తెచ్చుకోలేని స్థితిలోవున్నాను. ప్రతి రోజూ ఉద యన్నే లేవాలంటే కొంత ప్రయత్నం చేస్తేనేగాని లేవలేం. కాని ఈ రోజున నాకలాంటి ప్రయత్నం ఏమీ అవసరం లేకుండానే మెలకువ వచ్చింది. ఎదురుగానున్న బ్లాకులోని ఖైదీ ఒకడు గొంతుక చించుకొని పాడే అంతర్జాతీయ గీతం నాకు మెలకువ తెచ్చింది. అతడు తన శక్తినంతనీ వినియోగించి పాడగలిగి నంత గట్టిగా ఆ అంతర్జాతీయ గీతాన్ని పాడేస్తున్నాడు. తెల్లవార్లూ అతడా గేయాన్ని పాడుతూనే వున్నాడట.

జైలు జైలంతా మారు మ్రోగేటంత గట్టిగా పాడుతున్నా, ఆగొంతుకలో నాకు దైన్యమే కనబడింది. ఆ పాట వింటూంటే గుండెలు జలదరించి పోయాయి. అతని గొంతునుబటి అది అంతర్జాతీయ గీతంలా తోచలేదు. మృత్యువును ఆహ్వానిస్తూ పాడిన ప్రభాత గీతంలా వుంది. "నన్ను చంపితే మిమ్మల్ని మాత్రం వదలుతారా? మీరు కూడా నాతో కలసిపాడరేం" అని ప్రశ్నిస్తోన్నట్లుంది ఆ గాత్రం. ఎల్లాగా చంపేస్తారు కదా అంతర్జాతీయ గీతం పాడుతూనే ప్రాణాలర్పిద్దాం అనే నిస్పృహ స్పష్టముగా కనబడుతోందా పాటలో.



స్పానిష్ స్వాతంత్ర్యాన్ని రక్షించుతున్న ప్రధాని "నెగ్రిన్"

అతని పాట వింటూంటే జర్మను నాజీ జైళ్ళలోని హింసా ప్రకాండలు స్పురణకు వచ్చాయి. జర్మను దేశభక్తులు నాజీ జైళ్ళలో ఇల్లాగే అంతర్జాతీయ గేయాలు పాడుతూనే ప్రాణాలర్పించినట్లు చదివాను. కాని నేడట్టి ఖైదీని కళ్ళారాచూనే భాగ్యం కలిగింది, ఈ స్పానిష్ విద్రోహుల ధర్మమా అంటూ.

అంతలో నామీద నాకే జాలికలిగింది. ఈ నాటు అతన్నిగురించి జాలిపడుతున్నాను రేపు నాగతీ ఇంతేకదా అనుకున్నా. నిన్నసాయంకాలం నన్నీ కొట్టులో పడేసి తాళం వేస్తూ జైలువార్డరు అన్నమాటలు నాచెవులలో గింగురు మన్నాయి. అతని గొంతుకతోకలిపి నేను కూడా పాడేద్దా మనిపించింది. కాని... పాడితే నామరణాన్ని నేనే దగ్గరకు తెచ్చుకున్న వాడి నౌతానేమో! భయం, నాగొంతుకను నొక్కేసింది. కాని అతడంటే ప్రేమపొంగి పొరలిపోయింది నాలో. అమాంతంగాపోయి కౌగిలించు కుందామనిపించింది. కాని బంధింపబడివున్నా. ఏమిచెయ్యాలో తోచింది కాదు. అతడు నాకేసి చూపు మరల్చగానే, చటుక్కున లేచి నిలబడి పిడికిటి బిగబట్టి చేయిపైకెత్తి కమ్యూనిస్టు సాల్యూట్ చేశాను. చిరునవ్వు నవ్వుతూ అతడు మళ్లీ సాల్యూట్ చేశాడు. కాని నాకానవ్వులో కళాకాంతులు కనబడ లేదు. ఏదో విధిలేక నవ్వినట్లుగా తోచింది.

ఫాసిస్టు నిర్బంధంలో ఒకరాత్రి గడచింది. చెడువాసన మాత్రం తలబ్రద్దలు కొట్టేస్తోంది. అప్పటికి రెండురోజులనుంచి తిండితిప్పలులేవు. ఈ అవస్థకంటె ఒక్కసారి ఏపిరంగి గుండుకో....

ఎడ్గర్‌వాలస్ "ఆఫ్రికన్ యారన్స్" అనే నవలలో ఒక పాత్రచేత పలికించిన మాటలు జ్ఞాపకం వచ్చాయి, (నా మెదడు ఇంకా పని చేసే స్థితిలో వుంది. పరవాలేదు!) అతడిలా అనిపించాడు. "చచ్చిపోవడం అనేది ఒక్కమాటే సంభవిస్తుంది. ఎక్కువసార్లు చావడమనేది ఉంటే అది అలవాటే అయిపోతుంది. కాని అది నాకెప్పుడూ సంతసాన్ని కలిగించదు. ఏమంటావు? నా సిద్ధాంతం ఎలావుంది, ఇందంతా వేదాంతం!" అదంతా వేదాంతం కాబోలు, అనుకున్నా.

ఏమీ తోచిందికాదు! గోడమీద ఏవో పిచ్చి గీతలు గీద్దామనుకున్నా. జేబులో పెన్సిలు ముక్క కూడా లేదు. మంచం నుంచి ఒక తీగ ముక్క విరిచాను. గోడ దగ్గరకు వెళ్ళేసరికి అంతక్రితమే దానినిండా ఏవో వ్రాతలున్నాయి. పరిశీలించాను. పాపం! ఆ వ్రాతలన్నీ చూస్తే వెస్ట్ మినిస్టర్ అబీ లోని గోరీలమీది వ్రాతలు జ్ఞాపకం వచ్చాయి. ఆ సెల్‌లో బంధింప బడినప్రతి ఖైదీ, ఏది దొరికితే దానితో (పెన్సిలుతోనో, మసిబొగ్గుతోనో, ఆఖరికి మేకుతోతో) తనపేరు, అరెస్టు చేయబడిన తేదీ, చంపివేయబడే తేదీ వ్రాసి పారవేశాడు. నాకెక్కడా చోటు కనబడలేదు. ఆ వ్రాతల మీదే తోచినది వ్రాద్దామనుకున్నా. కాని ఆ జీవులెంత ఆవేదనతో వ్రాశారో, అవి నేను పాడుచేయడ మెందుకు?....

వాసన ప్రేగులు తోడివేస్తోంది. పట్టలేని చిరాకు, పట్టలేనంత కోపం, పౌరుషం నన్నావహించాయి. వివశుడనైపోయాను. నా మెదడు పనిచేయడం మానివేసింది. సెల్ గేటును చేతులతో గ్రుద్దాను. చేతులు నొప్పి పెట్టాయి. కాళ్ళతో తన్నాను. కాళ్ళు లాగాయి. సొమ్మసిలి పడిపోయాను. నిద్దుర పట్టేసింది. ఎంత సేపు నిద్దురపోయానో తెలియదు. వరుసగా ప్రేలిన ఐదారు తుపాకి చప్పుళ్లు విని త్రుళ్ళిపడి లేచాను. జైలు కాంపౌండులోనే ప్రేలాయి ఆ తుపాకులు. పాపం! ఏ నిర్భాగ్యులో........ ఆలోచనలో పడ్డాను .... ఇంతలోనే బూటు కాళ్ళ చప్పుడు స్పృహను తెచ్చింది. వార్డరు ప్రత్యక్షమయ్యాడు. నిన్నటివాడు కాదు. నా గేటు తాళం తీస్తూ "మైకేల్ అనే ఇంగ్లీషు వాడిని ఎరుగుదువా" అని అడిగాడు. తెలియదన్నాను. "అయినా సరే, ఆఫీసులోకి నిన్ను తీసుకు రమ్మన్నారు" అన్నాడు. దీనిని బట్టి ఎవరెవరిని ఖైదు చేస్తున్నారో, వారికే తెలియదు కాబోలు అనుకున్నా. ఔను! ఒక్కడి గోరీమీదనైతే ఏదైనా వ్రాయవచ్చును గాని, వందలాది వీరులు ఒకే గోతిలో పాతిపెట్టబడేటప్పుడు ఎవరిని గుర్తించి అని వ్రాస్తాం?

ఆఫీసుకు పోయాను. వెళ్ళగానే "నీవీ వార్డరుతో పోయి మైకేల్ అనే ఇంగ్లీషువాడిని గుర్తుపట్టి చూపించు" అనిగద్దిం చాడొకడు. అతడెవరో నాకు తెలియదని చెప్పబోయాను. నన్ను మాట్లాడనివ్వ కుండానే "నోరు మూసుకుని వార్డరు వెంట వెళ్ళు" అని ఉరిమాడింకొకడు. మైకేల్ ఎవరోగాని అతని ధర్మమా అంటూ ఖైదీలందరినీ చూచే భాగ్యం లభించింది.

ఒక చోట పన్నెండుమందిని వరుసగా నిలబెట్టి కదలకుండా కట్టి వుంచారు. వారి కెదురుగా 50 గజాల దూరంలో పన్నెండుగురు సిపాయీలు తుపాకులు బారుచేసి సిద్ధంగా వున్నారు.

"వారిలో మైకేల్ ఉన్నాడా?" అన్నాడు వార్డరు. మైకేల్ ఎల్లా వుంటాడో నాకు తెలియదు. అయినా వారివంక చూశాను. వారి దృక్కుల నుండే తీక్షణత నేనిప్పుడు వర్ణించలేను, వారి వాడిచూపులు శూలాల్లాగ గ్రుచ్చుతున్నాయి నా హృదయంలో. పెదవులు మొదల్చక పోయినా వారు చూపులే చెప్పాయి, వారునన్ను సి. ఐ. డి. (In former) గా అనుమానిస్తున్నారని, బ్రిటిష్ దుస్తులలో నుండడం చేత వారల్లా అవమానించి వుంటారు!

కాని ఇంతకంటె ఎక్కువగా నన్ను కదలించి వేసిం దింకొక దృశ్యం. ఒక కొట్టులో నలుగురు వరుసగా కూర్చొనివున్నారు. ఆకొట్టు వారికి పడుకోడానికి గాదుకదా, కాళ్ల సాచుకుని కూర్చోడానికి కూడా చాలదు. పాపం! ప్రయాణం పూర్తి కావస్తూన్న, రైలు పెట్టెలోని ప్రయాణీకుల వలె కూర్చున్నారు!

నన్ను జైలంతా త్రిప్పాడు. కాని ఇంతకీ మైకేల్ ఎవరో వార్డరుకు తెలియలేదు. మళ్ళీ నా సెల్‌లోకి తీసుకు పోతుండగా ఒక మిలిటరీ



విద్రోహి ఫ్రాంకో

ఆఫీసరు ప్రత్యక్షమై "మైకేల్ లేడూ" అని ప్రశ్నించాడు. లేడని వార్డరు తల ఊపాడు. "నాకు రెండు రోజులనుంచి తిండి తిప్పలు లేవు" అని అతనితో విన్నవించాను. "అయితే నిరశన వ్రతం బూనావన్నమాట!" అని వెక్కిరించి చక్కాపోయాడు.

౩

మరునాడు........

ఉదయాన్నే నడి వయస్సులోనున్న ఒక స్త్రీ నా సెల్‌గేటు వద్ద ప్రత్యక్షమైంది. ఆమె ఒక పత్రికా విలేఖరినని చెప్పింది. వచ్చీరాగానే

(మిగతా 20 వ పేజీలో)

# తుపాకి గుండ్లతో బ్రతుకుతున్న తిరువాన్కూరు.

## సంస్థాన ప్రజా ఉద్యమ విజృంభణము

### తిరువాన్కూరు.

తిరిగి మూడు ప్రాంతాలలో కాల్పులు.

తిరువాన్కూరు సంస్థానంలో నిర్బంధ విధానం మామూలుగానే సాగుతోంది. అరెస్టులు, శిక్షలు, జరిమానాలు, లాఠీఛార్జీలు నిత్యకృత్యము లయిపోయినవి.

తిరిగి త్రివేంద్రం, అల్లెప్పీ, అట్టింగాల అను ప్రదేశాలలో పోలీసులు ప్రజలపై తుపాకులను కాల్చిరి. వీటితో మొత్తం 6 పర్యాయాలు తిరువాన్కూరు సంస్థానంలో కాల్పులు జరిగినవి.

తిరువాన్కూరు ప్రజా పోరాటంలో పాల్గొనేటందుకు మలబారు నుండి వెళ్ళిన వలంటీరు దళాన్ని పోలీసులు అరెస్టు చేసిరి. అరెస్టుకు పూర్వము వారి నెన్నో తిప్పలు పెట్టారు. సంస్థానంలోకి ప్రవేశించాలని వలంటీర్లు— దానిని ఆపుచేయాలని పోలీసులు — విశ్వప్రయత్నాలు చేసిరి. దళాధిపతియైన ఏ. కె. గోపాలన్‌గారిని పోలీసులు తీవ్రముగా కొట్టిరి.

సెలవులు అయిపోయిన తరువాత పాఠశాలలన్నీ తెరచినా, స్టేట్ కాంగ్రెస్ ఆజ్ఞానుసారం విద్యార్థులు మాత్రం వెళ్ళుట లేదు.

ప్రతి మంగళవారమూ విద్యార్థులు ఊరేగింపుల జరుపుటకు తీర్మానించు కున్నారు. విద్యాలయాధికారులు వీటిని నిషేధించారు. అవసరమైతే చదువులు కూడ చాలించి స్టేట్ కాంగ్రెసు ఆజ్ఞలను నిర్వర్తించుటకు విద్యార్థులు నిశ్చయించు కున్నారు.

చెంగనచెర్రీ వద్ద ఒక గ్రామంలో విద్యార్థులు సమ్మెచేసిరి. ప్రక్క గ్రామానికి వెళ్లి అక్కడ స్కూలువద్ద పికెటింగు చేసిరి. మొత్తం అందరూ కలసి, ఆ ప్రాంతమందొక మైదానం వద్దకు పోయిరి. అక్కడ తిరువాన్కూరు మహారాజాగారి విగ్రహమున్నది. మందుపెండలో ఆ విద్యార్థులందరూ ఆ విగ్రము ఎదుట సాష్టాంగపడి, "ప్రభూ! మాకు తిండి లేదు. గుడ్డలు లేవు. లాఠీ ప్రయోగాలు, ఎక్కువై పోయాయి. కాల్పులుకూడ మామూలై పోతున్నాయి. మా తలితండ్రులు చచ్చిపోతున్నారు. నాయకు లందరూ ఖైదుల్లో మగ్గుతున్నారు. తిరువాన్కూరులో ఎక్కడా శాంతి లేదు. మమ్మల్నీ బాధలలో నుంచి రక్షించు. తిరువాన్కూరు రాజా వర్ధిల్లాలి! మహాత్మా గాంధీకి జై. స్టేట్ కాంగ్రెస్‌కి జై!" అని ప్రార్థనచేసి 15 నిమిషాలు మౌనంతో నిలబడి పోయిరి.

అమాయిక బాలుర హృదయాల్లో రగుల్కొనుచున్న స్వాతంత్ర్య దావానలం అక్కడ ప్రజలలోని స్వాతంత్ర్య తృష్ణను ఉద్దీపింపజేసింది. ఆ విద్యార్థిదళ నాయకుడిని ఉపన్యాసం యివ్వవలసిందని ప్రజలు కోరిరి. అయన పేరు థామస్ జాన్. నిషేధాజ్ఞలను లెక్క చేయకుండా, జాన్ ఉపన్యసించెను. తిరువాన్కూరులోని రాజకీయ వాతావరణాన్ని గురించి మహాత్ముని సందేశాన్ని గురించి ఉపన్యాసమిచ్చెను. సభ జయప్రదంగా జరిగింది.

### సంస్థానాలకు మహాత్ముని సలహా

"సంస్థానాలన్నీ శాశ్వతం కావు. పెద్దవి మాత్రమే మిగిలేందుకు కొంత అవకాశం వుంది. ఇవైనా తమ హద్దుల గుర్తించి ప్రజా సేవకు పూనుకొంటేనే నిలుస్తాయి. సంస్థానాధీశులు శాంతిని కాపాడకున్నచో వారూ నాశనం అవుతారు.

"తిరువాన్కూరులో విచారణ జరుగాలి అనేటందుకు ఎంతో సాక్ష్యం వుంది. ప్రభుత్వం లొంగి వచ్చేవరకూ ప్రజలందరూ ప్రత్యక్ష పోరాటాన్ని సాగించవలసినది. ఆఖరి మనిషి వరకూ పోరాటాన్ని నడపండి. శాంతియుతంగా మాత్రం యీ పోరాటం జరుగాలి" అని మహాత్ముడు సంస్థానాలకి సందేశము నిచ్చెను.

### ఢేంకానల్

ప్రజా మండలిని ప్రభుత్వము గుర్తించింది

ప్రజామండలి పూర్వకథ.

స్టేట్సు పీపుల్సు కాన్ఫరెన్సు తరపు విచారణ కమిటీ ఢేంకానల్ వచ్చిన సందర్భంలో యీ ప్రజామండలి జూన్ 27 వతేదీని ఏర్పాటు అయినది. యీ సంస్థాన మండలి ప్రజల ఇబ్బందులను గూర్చి విచారణ సాగిస్తూ యీ సంఘము అనేక బహిరంగ సభలను జరిపిరినది. అనతికాలంలోనే ఈ సంస్థ ప్రజా సానుభూతిని సంపాదించింది. ఢేంకానల్ సంస్థాన ప్రజల కోర్కెల జాబితాను తయారుచేసి ప్రజామండలి వీటి నన్నిటిని వందలకొలది బహిరంగ సభల ద్వారా ప్రచారం జరిపింది. సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు చేయాలనీ, ప్రభుత్వాధికారుల అక్రమపు వసూళ్లు రద్దు కావాలనియు, ప్రభుత్వాధికారుల అక్రమ చర్యలను విచారించుటకు ఒక విచారణ సంఘం ఏర్పాటు చేయవలెననియు, రైతుల వద్దనుండి భూములను బలవంతముగా వశపర్చుకొనుట ఆపు చేయాలనియు మొదలగు కోర్కెలు ప్రజలలో తీవ్రమగు ప్రచారాన్ని సాగించింది.

ఈ వీటికి పోటీగా ఢేంకానల్ దర్బారు కూడా కొన్ని బహిరంగ సభలను ఏర్పాటుచేసి ప్రజామండలి యొక్క అందోళనలో పాల్గొనవద్దని ప్రజలను హెచ్చరించ సాగినది. కాని ప్రజలందరూ ప్రజా మండలి సభలకే పోవుచు దర్బారుచే ఏర్పాటు చేయబడిన సభలకు పోరైరి.



తిరువాన్కూరు సంస్థాన నిరంకుశత్వానికి అసమ్మతి తెలియ జేయుటకు మద్రాసులో జరిగిన విద్యార్థుల ఊరేగింపు.

20 దినముల ప్రచారానంతరం ఒక మహాసభ జేనాపూర్‌లో ఏర్పాటు చేయబడింది. సుమారు 50, 60 మైళ్ళ దూరముకూడా నడచి ప్రజలా సభకు హాజరైరి. సుమారు 10 వేల మంది పాల్గొనిరి. ప్రజామండలి యొక్క కోర్కెలన్నియు ఆ మహాసభలో ఆమోదింప బడినవి. శ్రీ హరమోహన పట్నాయక్ గారిని అధ్యక్షులుగాను మహేశ్చంద్ర సుబాహుసింగ్ గారిని కార్యదర్శిగాను ఎన్నుకొనిరి. ఈ మహా సభలో ఢేంకానల్ పేరు మ్రోగింది.

తరువాత ఢేంకానల్‌లో ప్రజామండలి నిషేధము అధ్యక్ష కార్యదర్శుల అరెస్టు, అందుపై ప్రజల అందోళన, పోలీసుల కాల్పులు, నాయకుల విడుదల, మొదలగు విషయా లిదివరలో చూచియే యున్నాము.

సంధి షరతులను మాట్లాడుటకు రావలసినదని ఢేంకానల్ ప్రభువు హరమోహన పట్నాయక్‌గారికి కబురంపెను. వ్రాతపూర్వకముగా యిట్టి కబురు రావాలనియు, అట్టి షరతులను చర్చించే ముందు, ప్రజా మండలియొక్క అనుమతితాను పొందవలెననియు, లేకున్నచో తాను రాజాలననియు హరమోహన పట్నాయక్‌గారు తిరిగి జవాబు పంపిరి. సుమారు 50,000 ప్రజలు నాయకుల విడుదల యగుసరికి హాజరయి యుండిరి.

14 వ తేదీని ఢేంకానల్ ప్రజామండలిని గుర్తిస్తూ ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది.

ఢేంకానల్ ప్రజామండలి నాయకులున్ను దర్బారు ప్రతినిధులున్ను కలసి 14 వ తేదీని సంప్రదించు కొనిరి. 12 వ తేదీ కాల్పులలో మరణించిన వారి కుటుంబాలకు ముజరా ఇప్పి

(మిగతా 22 వ పేజీలో)



చీరాల పుగాకు పనివారలకై

# బ్రహ్మాండమైన ప్రజాందోళన లేవదీయాలి.

శ్రీ పోలేపెద్ది నరసింహమూర్తి

చీరాల పొగాకు పనివారల సంఘం ఏర్పడి కొద్ది కాలమే అయినప్పటికీ, ప్రశంసనీయమైన వర్గ కలహ చరిత్ర దానిని ఆంధ్రరాష్ట్ర కార్మికోద్యమంలో అగ్రస్థానాన్ని కొద్ది కాలంలో వహింప జేసింది. సంఘం యేర్పడక ముందు నుంచి కూడ, చీరాల పనివారలు, న్యాయంగా తమకు రావలసి నటువంటి, ఫ్యాక్టరీ చట్టంలో పొందుపరచబడి నటువంటి స్వల్ప కోర్కెల కొరకే, ఒంటరిగా, యితర ప్రజా సామాన్యం యొక్క సహాయం, సానుభూతి లేకుండా యిలా చేస్తున్నారు, యిలా చెందుతున్నారు అని పత్రిక ప్రకటనల ద్వారా ప్రచార మేమాత్రము లేకుండా, దారి డొంక లేకుండా ఎన్నో పోరాటాలను, ఎన్ని కష్టాలకైనా, ఎన్ని నష్టాలకైనా సరకు చేయకుండా సాగించారు. ఓడిపోయిన సమ్మెలున్నాయి. గెల్చినవి వున్నాయి. పోగొట్టుకున్న హక్కులున్నాయి. సంపాదించుకున్న, హక్కులున్నాయి. బొత్తిగా పోగొట్టుకొని, యజమానులు పెట్టు, రిట్రెంచిమెంట్లకు, తిట్టు తిమ్మలకు, క్రూర నిర్బంధ విధానానికి, జుల్మానాలకు అపారంగా గురియైన సమయాలున్నాయి. యజమానుల చేతులో యిన్ని యిబ్బందులు, అన్యాయాలు అనుభవిస్తున్నప్పటికి వెనుకంజ వేయకుండా పోరాటాలను సాగిస్తూనే యున్నారు. ఈ పోరాటాల ఫలితంగా లభించిన అనుభవం, చైతన్యం, అప్పుడప్పుడు పొందుతున్న అపజయాలు వీరిని సంఘం యొక్క అవశ్యకతను గ్రహింప జేసినాయి.

సంఘం యేర్పడిన దగ్గర నుంచి యజమానులకు రేచిక్క యెక్కింది. ఈసంఘం బలత్తరమయితే తమకు పక్కలో బల్లెంలాగ ఉంటుందని భయపడి దీన్నెలాగైనా మొగ్గలోనే తుంచి వేయాలని పట్టుదల వహించారు. దాని ఫలితంగానే లోగడ వీరు అతి స్వల్ప కోర్కెలను కోరుతూ శాంతి యుతంగా సమ్మె సాగించినపుడు, వీరి సమ్మెను, వీరి సంఘాన్ని భగ్నం కావించటానికి వీరిలో భీభత్సం, భీతి కలుగచేసి లొంగదీసుకోటానికి పోలీసులచేత లాఠీ ఛార్జి చేయించారు. కాల్పులను ప్రయోగింప చేశారు. ముఖ్యమైన వారి నందరిని పనిలో నుంచి తీసేశారు. బోలెడు మందిని అరెస్టు చేయించారు. ఎంక్వైరీ సమయమప్పుడు కూడా పనివారల తరపు నుంచి నిజమైన సాక్ష్యము రానివ్వకుండా చేసి, తమ తరపున యివ్వబడు దొంగ సాక్ష్యమునుబలవత్తరం కావించుకొని ఎంక్వైరీ రిపోర్టును తమ కనుకూలముగా తయారు చేయించు కొనుటకుగాను, ప్రధానమైన పనివారి నందరిని అరెస్టు చేయించారు.

సంఘాన్ని నాశనం చేయటంలో యీ ప్రయత్నాలతో ఆగక, సంఘంలో చీలికలు పెట్టటానికి యెత్తులు యెత్తారు. పెద్ద పెద్ద జీతాల క్లార్కులను మెల్లిగా మధ్యపెట్టి దగ్గరకు చేరదీసుకొని "మల్లాది యజ్ఞనారాయణ గారిని అధ్యక్ష పదవినుంచి తొలగించి మీలో ఎవరినైనా అధ్యక్షునిగా ఉంచితే, మీ యూనియనును గుర్తిస్తాము, మీ హక్కులన్నీ యిస్తాము," అని బులిబుచ్చి కబుర్లన్నీ చెప్పారు. ఈ విధంగా చేయకపోతే పనిలోనుంచి తీసివేస్తామనే బెదురు పెట్టారు. తాము పెట్టిన ఆశయందు క్లార్కులకు మరింత గాఢ విశ్వాసం కలుగ చేయటానికి జిల్లా కలెక్టరు చేతకూడ చెప్పించారు. ఒక వైపు ఆశపెట్టి మరొకవైపు భయపెట్టి పెద్ద క్లార్కులను లొంగతీసుకొని వీరిలో ప్రస్తుతపు అధ్యక్షుని ఊడబెరకాలనే ఉద్దేశాన్ని బాగా నాటారు. ఈ క్లార్కులకు యజమానులు చెప్పిన తీపి కబుర్లు కేవలం బూటకమని, పనివారిలో పనివారికి చీలికలు పెట్టి సంఘాన్ని నాశనం చేయటానికి చెప్పబడినవని, వారు లోగడ స్థానిక ప్రభుత్వ అధికారుల సహాయంతో స్వల్ప కోర్కెలను కోరిన పనివారలపై అతి నిరంకుశ నిర్బంధ విధానమును ప్రయోగింప చేసిన కర్మకాండ అంతా చూసుకుంటే, తేటతెల్ల మవుతుంది. అధ్యక్షుని తీసివేయాలసిందని చెవుతూ, ఏ కోర్కెలనైతే యిస్తామంటున్నారో, ఆ కోర్కెలను కోరినందుకే, ఆ కోర్కెల కొరకు సమ్మె చేసినందుకే, ఆ కోర్కెలను యివ్వకపోగా, పనివారలపై హింసా విధానము ప్రయోగించారు, యిప్పుడు వారు క్లార్కులకు యీ ముక్కలు చెప్పటంలో, అమాంతంగా మరమ్మత్తయి, హృదయ పరివర్తన కలిగి పనివారల పట్ల దయా దాక్షిణ్యత వహించారు అనుకుందామా. అధ్యక్షుని తీసివెయ్యమనటం యెందుకు? వీరి దయాదాక్షిణ్యానికి అడ్డు తగులుతున్నాడా? వీరివ్వవస్తున్న కోర్కెలను యివ్వవద్దంటున్నాడా? వీరిచ్చు కోర్కెలను బీద పనివారలకు లేకుండా తానే దిగమింగుతాడనా? దయాదాక్షిణ్యంతో ఉన్నట్లయితే పనివారలను యింత హింస ఎందుకు పెడతారు? యింత ఘోరకృత్యాలు జరిపి అఖరికీ కబుర్లు చెప్తున్నారంటే, మన శ్రేయస్సు కోరేనా వీటిని చెబుతున్నది అని మనం నిర్ణయించుకోవలసి యున్నది. ఆలా నిర్ణయించుకోకుండా, వాళ్ళు చెప్పింది వేదపు ముక్కలని గుడ్డిగా నమ్మేస్తే, దాని వల్ల చేటున్నది పనివారల సంఘానికి. పైన మేకతోలు కప్పుకున్నప్పటికి, లోపల తోడేలు తోడేలుగానే యుంటుంది. దాని రక్త పిపాస యెక్కడికి పోదు. ఇప్పుడు యజమానులు అతి సాధువుల్లాగ ధర్మదాతల్లాగ పనివారను ఉద్ధరించేట్టుగా మాటలు చెబుతున్నారంటే, పనివారల సంఘాన్ని కంపెనీ యూనియనుగా తయారుచేసి తమ చేతుల్లో పెట్టుకోటానికి, తమ యిష్టానుసారం ఆడించటానికి, సమ్మెలేమీ చెయ్యనీయకుండా, పనివారల నింకా దోచుకోటానికి. అది వారి యుద్దేశం. యూనియన్‌కు గుమాస్తాలలోనే ఒకరిని అధ్యక్షునిగా ఉండమనటంలో గుమాస్తాని తమ అదుపు ఆజ్ఞలలో ఉంచుకోవచ్చు. రెండో ఉద్దేశ్య మేమిటంటె, అధ్యక్షునికి వ్యతిరేక పక్షాన్ని ఒక దానిని లేవ తీసి తమ చేతుల్లో నుంచుకొని అధ్యక్షుని కనుకూలంగా ఉండే పక్షాన్ని అణచటం. ఈ విధంగా సంఘంలో చీలికలు కల్పించి, చివరకు తమ హస్తగతం చేసుకోటం.

యజమానులు వేసిన యీ పాచిక బాగా పారుతున్నది. కొద్దిమంది పెద్ద క్లార్కులు ఈ పాచికలో పడ్డారు. దీని ఫలితంగా యీ కొద్ది మంది కలిసి కార్యనిర్వాహక వర్గమంతా కలిసి చేసినట్టుగా యజ్ఞనారాయణపై ఒక విశ్వాస రాహిత్య తీర్మానమును పాసు చేశారు. ఆ తీర్మానంతో "వారు తమ అధ్యక్ష పదవి నుండి తొలగినచో కంపెనీ అధికారులు యూనియనును రికగ్నైజు చేయుటకు సంసిద్ధులై యున్నట్లు జిల్లా కలెక్టరుగారు చెప్పి రాజీనామా యియ్యవలసినదిగా సలహా యిచ్చిననూ" అని ఉన్నది. సంఘానికి సంబంధించిన సభ్యులు, తమను పీల్చుకు తింటూ బానిసలుగా అణిచి పెట్టి యుంచుతున్న వ్యతిరేక వర్గంవారు చెప్పే మోసపు మాటల్లోపడి, వారుచెప్పినట్టు చేస్తుంటే సంఘాని కెంత హానో వేరే చెప్పనక్కర్లేదు. సంఘం వృద్ధికావటం, పనివారలలో ఐకమత్యం బలపడటం యజమానులకు గిట్టవు. సంఘం బలపడుతున్నదని కనపడి నప్పుడల్లా సంఘంలోవున్న వారి కేవేవో లేనిపోని ఆశలు కల్పించి మరియొకవైపున కఠినమైన షరతులు అడ్డంకులు పెడుతూ సంఘాన్ని బలహీన పర్చుటకు చూస్తారు వాళ్లు చేప్పేటట్టు వింటున్నట్టయితే, వాళ్ళు ఆడమన్న ఆటల్లా ఆడుతుంటే మనకు సంఘం యెందుకు? సంఘ శ్రేయస్సు కొరకు, బయటివారు సంఘంలో పని చేస్తుండటం గిట్టదు. అందుకనే మిల్లు యజమానులందరు 'యీ సమ్మెలన్నీ కమ్యూనిస్టుల ప్రోద్బలంవల్ల సాగుతున్నయి. కమ్యూనిస్టులు కార్మికులకు దౌర్జన్యం బోధిస్తున్నారు. ప్రభుత్వం వీరిమీద తగిన చర్య తీసుకోవాలి' అని కార్మిక నాయకులను కార్మికోద్యమాన్నుంచి శాశ్వతంగా వేరు చేయాలని దుష్ప్రచారం సాగిస్తున్నారు. యజమానుల యొక్క ఇలాంటి దుష్ప్రచారాన్ని దుర్బోధలను విని మన గొయ్యె మనం తవ్వుకుంటామా? దీనివల్ల సంఘానికి తీరని ముప్పు వాటిల్లుతుంది. యజమానుల యొక్క కుతూహలం, యెప్పుడైతే సంఘంలో కొంతమంది వారి సలహాలను విని, విశ్వాస రాహిత్య తీర్మానాన్ని తీసుకొచ్చారో, అప్పుడే నెరవేరిందన్నమాటే. ఇదే సమయంలో అధ్యక్షుని రాజీనామా యజమానులకార్యం పూర్తిగా ఫలించడానికి మరింత సాయపడింది. అధ్యక్షుడు రాజీనామా యివ్వటంలో ఆలోచన సాలోచన ఉన్నట్టు యేమాత్రం కనపడటం లేదు. ఈ అన్ని పరిస్థితులు చూచుకుంటే చీరాల పొగాకు పనివారల సంఘం చాల విషమ పరిస్థితుల్లో చిక్కుకొన్నదని స్పష్టపడుతుంది. ఈ విషమ పరిస్థితులను తొలగించటానికి సంఘములోని గుమాస్తాలేమి, పనివారలేమి అందరు యేకమయి, యజమానుల మోసపు మాటలను వినకుండా వారి కుతంత్రాలను తుద ముట్టించాలి. కార్యనిర్వాహక వర్గంవారు తమ యొక్క విశ్వాస రాహిత్య తీర్మానాన్ని ఉపసంహరించు కోవలెను. అధ్యక్షుడు తనయొక్క రాజీనామాను ఉపసంహరించు కోవలెను. ఈ రెండు తక్షణం జరగాలి. కార్యనిర్వాహక వర్గంవారు తమ విశ్వాసరాహిత్య తీర్మానాన్ని ఉపసంహరించు కొనుటకు నిరాకరించినా, అధ్యక్షుడు తనయొక్క రాజీనామాను ఉపసంహరించు కొనుటకు నిరాకరించినా సాధారణ సభ్యులందరు కార్యనిర్వాహక వర్గాన్ని ఒత్తిడిచేసి సాధారణ సంఘ సమావేశాన్ని జరిపి దానిలో కార్యనిర్వాహక వర్గంవారి విశ్వాస రాహిత్య తీర్మానాన్ని త్రోసివేయవలెను. అధ్యక్షునిచేత తనయొక్క రాజీనామాను ఉపసంహరింప చేయవలెను.

ఒక చెంప సంఘాన్ని నాశనం చేయుటకు యజమానుల ప్రయత్నాలు లెక్క లేకుండా ఉన్నాయి. మరియొక చెంప కార్మికుల యజమానుల మధ్య తగువు విషయంలో చేయబడుచున్న ప్రభుత్వ యెంక్వైరీలు యింకా ముగియ లేదు. ఇటువంటి సమయంలో సంఘంలో ఒకరితోనొకరుపోట్లాడుకుంటూ, విశ్వాసరాహిత్య తీర్మానములను ప్రయోగించుకుంటూ నాయకత్వం కోసం పెనుగులాడుతూ సంఘాన్నంతా పంచకూళ్ళ కషాయంచేస్తే — అటు యజమానుల ప్రయత్నాలు నెరవేరుతయి. యిటు యెంక్వైరీల ఫలితాలు యజమానుల పక్షమవుతయ్యి. వీటి ఫలితంగా నష్టపడే దెవరు? యజమానుల నిరంకుశత్వానికి గురి అయ్యే దెవరు? నిరుద్యోగాలకు, ఆకలి మంటలకు గురి అయ్యేదెవరు? లాఠీ దెబ్బలు, పోలీసు కాల్పులకు గురియైన బీద కార్మికులు, సంఘంలోని సోదరు లందరు ఈ క్లిష్ట పరిస్థితి నంతా దృష్టి నందుంచుకోవాలి.

ఇప్పటికే సంఘం చాలవరకు బలహీనమయింది. నిర్మాణ పటుత్వం సన్నగిల్లింది. ఇప్పుడు ఏర్పడిన దుస్థితిని సమయంలో అరికట్టకపోతే సంఘం మరింత అడుగుకు పోతుంది. ఆ దుస్థితినుంచి సంఘాన్ని తప్పించి రక్షించుటకుగాను గుంటూరు జిల్లాలోని కాంగ్రెసు నాయకులు, సోషలిస్టులు, కార్మిక నాయకులు సిద్ధపడాలి. యజమానుల మాటలు విని మోసపోతున్న గుమాస్తాలు మొదలగు వారికి నచ్చచెప్పి యజమానుల చేతుల్లోకి పోనివ్వకుండా చేసే బాధ్యతను వీరందరు కలిసి నిర్వహించాలి. అందరిని కూర్చి ఐకమత్యంగా ఉండేట్టు చేసి యజమానుల మోసపు మాటలను వినకుండా చేసి సంఘాన్ని బలిష్ట పర్చటానికి వీరందరు కలిసి తోడ్పడినట్టయితే, పనివారందరు చైతన్యం పొందుతుంటారు. తమ హక్కుల కొరకు ధైర్యంతో పోరాడుతుంటారు. ఈ విధమైన కృషితోటి నిర్మాణ బలం సంఘంలో యెక్కువవుతున్న కొద్దీ, సంఘములో ఏవిధమైన ద్రోహానికి, దురభిలాషలకు తావే యుండదు. ఈ విధమైన సలహాతోటి. ఎవరెవరైతే యజమానుల మాటలను వింటున్నారో వారి దృష్టిని సంఘం యొక్క శ్రేయస్సు వైపు మరల్పటానికి ప్రయత్నాలు చేయకుండా ఊరుకుంటే, వారిని యజమానుల చేతుల్లోకి మరింత సునాయాసంగా, త్వరితంగా పోనిచ్చిన వారమగుతాం. అందువల్ల యజమా

(మిగతా 18 పేజీలో)



# పేద రైతుకు మద్రాసు ప్రభుత్వ ఋణ సహాయం

## రైతులకు ఋణాలు

మదరాసు రైతు ఋణ పరిష్కార చట్టం అమల్లోకివచ్చి నప్పటినుంచీ రైతులకు ఋణాలు దొరక్క, షాహుకార్లు చేస్తూన్న కుయుక్తులకు లోనుగావలసి వస్తూన్నందున, ప్రభుత్వమే దీర్ఘ వాయిదాలపై అప్పులిచ్చి రక్షించవలసిన దని రైతులు ఆందోళన చేశారు. దానికి ఫలితంగా, మదరాసు ప్రభుత్వంవారు యీ క్రింది షరతులపై రైతులకు ఋణములిచ్చే విధానం తెలియజేస్తూ, ఒక ప్రకటన చేశారు.

ఋణస్థులగు రైతులకు వాయిదాల పద్ధతి మీద అప్పులిచ్చుటకు 1938—39 బడ్జటులో 50 లక్షల రూపాయలు గ్రాంటు చేయబడింది. ఈమొత్తమును పంచిపెట్టు విషయమై రివెన్యూ బోర్డువారితో కలిసి జాగ్రత్తగా ఆలోచించ బడినది. అప్పులిచ్చు పద్ధతిని గురించి యిదివరలో చేయబడిన నిబంధనలన్నీ 1938 మదరాసు ఋణ పరిష్కార చట్టము ననుసరించి యిందు నిమిత్తమై మార్చివేయ బడ్డాయి. క్రొత్త నిబంధనలు 13 వ తారీఖు గెజెట్‌లో ప్రచురణమై, అక్టోబరు నెల నుండీ అమలులోనికి వస్తాయి.

5000 రూపాయలకు మించని మాగాణి, లేక జిరాయతీ, గలిగి యితర చిక్కులులేని రైతులకు మాత్రమే అప్పు లీయబడును. ఆ అప్పులు గూడ, సివిల్ కోర్టులలో డిక్రీ అయి చెల్లించుటకు ఉత్తరువు లిచ్చిన, లేక ఋణ పరిష్కారసంఘం ఆమోదించిన అప్పుల పరిష్కారమునకు మాత్రమే మంజూరు చేయబడును. ఋణ పరిష్కార సంఘములులేని రివెన్యూ డివిజన్లలో, "లోన్" ఆఫీసరు పై చట్టమున కనుకూలమై డిక్రీలు పొందని అప్పులకు కూడ, ఋణదాత—ఋణస్థుల ఒప్పుదల అయినప్పుడును అట్టి సహాయమునకు తగిన యోగ్యత కనుపించి నప్పుడును ఋణమును మంజూరు చేయవచ్చును.

దరఖాస్తుదారుని స్థిరాస్థి హామీపైన మాత్రమే ఋణముల పూర్తి పరిష్కారములకు అప్పులివ్వబడును. అప్పులో కొంత భాగమే పరిష్కరింప దలచినచో, ఆ పరిష్కారము వలన కొంత స్థిరాస్థి మీదగల ఋణబాధలు పూర్తిగా తొలగునదై యుండవలెను. తీర్చవలసిన ఋణములు 100 రూపాయలకు తగ్గకుండాను, 1000 రూపాయలకు మించకుండాను ఉండవలెను.

వడ్డీ సంవత్సరమునకు $6\frac{1}{4}\%$ చొప్పున సంవత్సర వాయిదాల పద్ధతిని సొమ్ము వసూలు చేయబడును. మొదటి వాయిదా ఒక సంవత్సరమునకు మించకుండా చెల్లించవలెను 20 గాని, ప్రత్యేక సందర్భాలలో 30 గాని వాయిదాలివ్వబడును. ఈ వాయిదాలు "లోన్" ఆఫీసరు నిర్ణయించును.

ఈ క్రింద ఉదాహరింపబడిన ఉద్యోగులు ఆయా మొత్తములను మంజూరు చేయవచ్చును. రివెన్యూ డివిజనల్ ఆఫీసరు రు 1000; తహసీల్దారు రు 500; డిప్యూటీ తహసిల్దారు రు 250. కలెక్టర్‌చే అధికారం పొందినప్పుడు రు 500; ఇతర డిప్యూటీ తహసిల్దార్లు కలెక్టరు అధికారం పొందినచో, రు 250.

ఈ అప్పుల విషయంలో నియమింపబడిన డిప్యూటీ, లేక స్పెషల్ తహసిల్దారులకు రు 1000 ల వరకూ అప్పులిచ్చుటకు కలెక్టర్లు అధికార మీయవచ్చును.

అప్పుదారుడు తన దరఖాస్తును రివెన్యూ ఇన్‌స్పెక్టరు వద్ద నున్న ఫారంలో పూర్తిచేసి, అక్కడి పై ఉద్యోగస్తుల కందజేయ వలెను. దానితోబాటు డిక్రీ బాకీలు కూడా ఉంచవలెను. అలా డిక్రీ కాకపోయిన అప్పులకు ఋణదాత వద్దనుండి "లోన్" ఆఫీసరు యొక్క సిఫార్సు లంగీకరించినట్లు సంతకం చేయించి, పంపవలెను. చదువురాని వారి విషయంలో, వేలుముద్రలు యిద్దరి సాక్ష్యములతో పంపవలెను.

ప్రజాభిప్రాయమును మన్నించి, యిప్పటికైనా మద్రాసు కాంగ్రెసు మంత్రివర్గం వారు దీర్ఘ వాయిదాలపై రైతులకు అప్పులిచ్చే పద్ధతిని ప్రవేశపెట్టి నందుకు సంతసించ వలసియున్నది. ధన మదాంధతచే మైమరచియున్న షాహుకార్లు రైతులపై చేస్తూన్న హడావిడికి, కుతంత్రాలకు కొంతవరకు హద్దు యేర్పడింది. ఆందోళన ద్వారా ప్రజలు కాంగ్రెసు మంత్రులచే కొంతవరకైనా తమ యిబ్బందులు తొలగింపుకొన గలరని స్పష్టపడింది.

ప్రభుత్వ నిబంధనల ప్రకారం, ఋణ పరిష్కార సంఘం ఆమోదించిన అప్పుల పరిష్కారమునకు అప్పులు మంజూరు చేయబడతాయి. అట్టి సంఘాలు లేని రివెన్యూ డివిజనులో "లోన్" ఆఫీసరు, ఋణదాత అంగీకరిస్తే గాని మంజూరు చేయబడవు. పరిష్కార సంఘాలలో రైతు సంఘ ప్రతినిధులను కూడా నియమించి నట్లయితే రైతులకు తగిన న్యాయం కలుగును కాబట్టి, ఆ విధంగా నియమించ వలసినదని అనేక రైతు మహాసభలలో ప్రభుత్వానికి సిఫార్సు చేస్తూ తీర్మానాలు చేయబడ్డాయి. డెవలప్‌మెంటు శాఖామంత్రి గారికి కూడా అనేక విజ్ఞాపనలు చేయబడ్డాయి. ఆ తీర్మానాలను, విజ్ఞాపనలను ప్రభుత్వం అమలు పరచినట్లయితే, ఋణముల విషయములో ప్రభుత్వోద్యోగులకు మొదటి నుంచీ




కాంగ్రెసు మంత్రి వర్గమూ, జమీందార్లూ చేసికొన్న ఒడంబడిక ఫలితంగా నలిగిపోతున్న బీహార్ రైతు.

అలవాటైన ప్రజా ప్రతికూల వైఖరి కొంత వరకు మారుటకు సావకాశ మేర్పడియుండేది. ఇప్పుడిది జరుగదు. కాబట్టి, యిప్పుడైనా ప్రజా ప్రతినిధులైన మన మంత్రులు ప్రతి రివెన్యూ డివిజనుకొక ఋణ పరిష్కార సంఘాన్ని యేర్పాటు చేసి, దానిలో రైతు సంఘ ప్రతినిధులకు కూడా స్థానం యిచ్చి, అట్టి పరిష్కార సంఘాలు సిఫార్సు చేసిన అప్పులే ప్రభుత్వం మంజూరు చేయాలి. రైతు సంఘాలు యీ మార్పుకై ఆందోళన చేయవలసి యుంటుంది.

ఇంతేగాక, ప్రభుత్వ రూల్సు ప్రకారం, రైతు యొక్క ఋణం 1000 రూపాయలకు మించనిదై యుండాలి. అనేకమంది బీద రైతులకిది అనుకూలించి నప్పటికీ, 1000 రూపాయలకు పైగా అప్పులున్న రైతులు వేనకువేలున్నారు. కాబట్టి 10 యకరాల భూమిగల రైతు లందరికీ ప్రభుత్వ సహాయం చేయవలసి యుంటుంది.

## మందాసా ఎస్టేటులో రైతు సంఘ ప్రచారం

ఉత్తర విశాఖపట్టణ జిల్లా రైతు సంఘము యొక్కయు, ఇచ్ఛాపురం తాలూకా కాంగ్రెసు సంఘము యొక్కయు యాజమాన్యమున శ్రీ గౌతు లచ్చన్నగారి నాయకత్వమున రైతు సేవాదళం బాయనలో బయలుదేరి, నాలుగు దినములు మందాసా ఎస్టేటు గ్రామాలలో బహిరంగ సభలు, ఊరేగింపులు జరిగాయి. వర్షాలు లేక పంటలు పాడగుటచే, వచ్చే ఏడాదికి వ్యవసాయమునకు దిక్కులేదు సరేకదా ప్రస్తుత జీవనోపాధికి, పశువుల పోషణకు ఎట్టి రక్షణ లేకపోవుటచేత, వెంటనే మదరాసు ప్రభుత్వంవారు కరవు నివారణ పనులు ప్రారంభించ వలెనని కోరుతూ సభలలో తీర్మానించబడెను. రైతుల పరపతి పూర్తిగా పాడైనందువల్ల, 47 వ ఫసలీ శిస్తులు యీ మాసాంతములోగా చెల్లించుటకు సాధ్యం కానందున 47 వ ఫసలీ శిస్తులు చెల్లించుటకు మరొక సంవత్సరం గడువు యిప్పించ వలసినదనియు; వచ్చే నవంబరు ఎసంబ్లీ సమావేశంలో నైనా రైతుసంఘంవారి కనీసపుకోర్కెల ప్రణాళిక ననుసరించి ఎస్టేటు ల్యాండ్ ఆక్టు సవరణ బిల్లును ప్రవేశపెట్టి, జమీను రైతులకు రక్షణ నీయవలెననియూ ప్రభుత్వమును కోరుచూ తీర్మానించబడెను.

## తుని తాలూకాలో క్షామ పరిస్థితులు

ఈ సంవత్సరం తొలకరిలో వర్షములు జాస్తీగా కురియుట చేత, తాలూకా యందలి రైతులు భార్యల పుస్తెలు వగైరా అమ్మి ఊడ్పులకు ఖర్చుపెట్టారు. కాని, ఊడ్పులు అయినప్పటి నుంచీ ఒక్క వర్ష బిందువైనా పడక, మండు వేసవిలో మాదిరిగా ఎండలు కాస్తున్నాయి. ప్రజలకు, పశువులకు మంచి నీటికి కూడా కరవై పోయింది. తాలూకా అన్ని ప్రాంతాలలోను, సగం మంది జనాభా తిండిలేక మలమల మాడిపోతున్నారు. మిగిలిన కుటుంబాలు రెండు నెలలలో గంజికి కూడా కరవు కావలసిన రోజులు రానున్నవి. ప్రజలెట్లు బ్రతకవలెనో, జమీందారీ శిస్తులు ఏ విధంగా చెల్లించవలెనో తెలియక, రైతులు అల్లాడి పోతున్నారు. శ్రీ ప్రకాశం పంతులు గారు (రివెన్యూ మంత్రి) యీ నెల ఇచ్ఛాపురం నుంచి మద్రాసు వెళ్ళేటప్పుడు తుని స్టేషనులోను, హంసవరం, అన్నవరం, దుర్గాడ స్టేషనులలోను వేలకొలది రైతులు



20 లేక 25 మైళ్ళ దూరం నుంచి నడచివచ్చి, కరవు—కరవు అని మొఱపెట్టుకున్నారు. చెరువుల మరమ్మతు బాధ్యత జమీందార్ల చేతులలో ఉన్నందున, వారు ఎట్టి శ్రద్ధయు తీసుకోవడం లేదు. కాబట్టి, యీ క్రింది సూచనల ప్రకారం మదరాసు గవర్నమెంటు వెంటనే పంటకాల్వల సదుపాయం చేయించవలసినదని కోరారు:

1. శంఖవరంపైన ఉన్న కట్టువలో రిజర్వాయర్ ఎర్పరుచుట.

2. చామర్లకోట నుంచి ఒకప్పుడు తుని తాలూకాకు కాలువ వేయుటకు గవర్నమెంటు ప్రయత్నించగా, పిఠాపురం జమీందారుగారి అటంకముచే ఆగిపోయింది. ఇప్పుడు ఆకాల్వను త్రవ్వించే యేర్పాటు చేయుట.

3. గోకవరం మీదుగా యేలేటి కాలువను తుని తాలూకాకు వేయించుట.

తుని తాలూకాలో యించుమించు ప్రతి గ్రామంలో వర్షాధారముపై ప్రజలు జీవించాలి. దీనికితోడు, జమీందారీ శిస్తులు యకరమునకు 30 రూపాయల వరకు కూడా ఉన్నాయి. వెంటనే కాంగ్రెసు మంత్రివర్గానికి, జిల్లా అధికార్లకు తాలూకా యందలి కాటక పరిస్థితులను గురించి టెలిగ్రాముల ద్వారా తెలియ పరచుకొనుట, స్థానిక ప్రభుత్వోద్యోగుల ఆఫీసుకు స్వయంగా రైతులువెళ్ళి చెప్పుకొనుట మొదలైన పద్ధతుల ద్వారా ఆందోళన చేయవలసి యుంటుంది.

## పుల్లూరు కరణంగారి అక్రమాలు

పై శీర్షిక క్రింద గత సంచికలో ప్రచురింపబడ్డ వార్తలో "మైలవరం సబ్ ఇన్‌స్పెక్టరుగారు" అనుటకు బదులు "కొండపల్లి సబ్ ఇన్‌స్పెక్టరుగారు" అని పడినది. సవరణను పాఠకులు గమనింప ప్రార్థన. — న. సం.

విచారణ

పుల్లూరు కర్ణంగారి విచారణ యీ నెల 22 వ తేదీని మైలవరం మకాంలో బెజవాడ తహసిల్దారుగారి యెదుట ప్రారంభమైనది. రైతుల తరపున 8 మంది సాక్షులు విచారించబడ్డారు. పుల్లూరు నుంచి రైతులు సుమారు 200 మంది కరణంగారి లంచగొండి తనమును గురించి, ఇతర అక్రమాలను గురించి పాటలు పాడుకుంటూ, సాక్ష్యం యిచ్చుటకు వచ్చారు. కరణంగారి తరపున ఒక్కరూ సాక్ష్యం యిచ్చుటకు సిద్ధంగా లేరు. సుమారు 100 మంది రైతుల సాక్ష్యమును తీసుకొన వలసినదని తహసిల్దార్‌గారిని కోరగా, వారు (తనకు అవకాశము చాలదన్నారు) ఈ విధానముపట్ల కృష్ణాజిల్లా రైతు సంఘ కార్యదర్శి తమ అసంతృప్తిని ప్రకటించారు.

జిల్లా యందలి ఇతర గ్రామాలలో కూడా ఆఫీసర్ల, ఉద్యోగుల లంచగొండి తనాన్ని గురించి పుల్లూరు గ్రామస్థుల వలె ఐకమత్యముతో పై అధికార్లకు తెలియజేస్తూ, సాక్షీములిస్తూ, పట్టుదలతో పనిచేయ వలసి యున్నది.

## మైలవరం రివిన్యూ ఇనస్పెక్టరుగారి అవినీతి

బెజవాడ తాలూకా, నందిగామ గ్రామ కాపురస్థులైన హరిజనులు వెలటూరు గ్రామ మందలి పోరంబోకు గయాళి భూమిని యిప్పించ వలసినదని దరఖాస్తులు పెట్టుకోగా, బెజవాడ తహసిల్దారుగారు సుమారు 50 యకరాల భూమిని మూడు నెంబర్లలో ఉన్నదాన్ని గ్రాంటు చేశారు కాని. దేవుని ఆజ్ఞ అయినా పూజారి వరమీయడన్నట్లు, మైలవరం రివెన్యూ ఇన్‌స్పెక్టరుగారు సదరు భూమిని చూపించక, హరిజనులను యిబ్బంది పెట్టారు. ఆఖరికి, 10 రూపాయలు, ఒక బండి కట్టెపుల్లలు యిస్తే చూపిస్తానన్నారట, హరిజనులు ఆ ముడుపును కూడా చెల్లించుకొన్నారు. ఇన్‌స్పెక్టరుగారు య. 14.92 ల విస్తీర్ణం గల ఒక నెంబరు భూమిని మాత్రం చూపించి, మరొక నెల రోజులు తిప్పించుకొని, మరొక 10 రూపాయలిస్తే మిగిలిన భూమిని చూపిస్తానన్నారట! ఈ బాధ పడలేక, హరిజనులు బెజవాడ తహసిల్దారు గారికి యీ విషయమై అర్జీ ద్వారా తెలుపుకున్నారు. త్వరలో ఆయన విచారణ జరిపి, రివెన్యూ ఇన్‌స్పెక్టరు గారి యీ అవినీతి ప్రవర్తనకు ఆయనను శిక్షించ వలసి యున్నది. జిల్లా రైతు సంఘం యీ విషయంలో శ్రద్ధ వహిస్తున్నందుకు రైతులు కృతజ్ఞులు.

సర్వత్రా వ్యాపించియున్న యీ లంచగొండి తనాన్ని నిర్మూలించుటకు కాంగ్రెసు మంత్రి వర్గంవారు ప్రయత్నించునట్లు జిల్లా రైతు, కాంగ్రెసు సంఘాలు బలమైన ఒత్తిడిని కలుగచేయాలి.

## కోలగట్ల కూలీల సమ్మె

నెల్లూరు జిల్లా, ఆత్మకూరు తాలూకా కోలగట్ల గ్రామంలో జరుగుతూన్న వ్యవసాయ కూలీల సమ్మెను "పరిష్కరించే" టందుకు 17—9—38 వ తేదీన పోలీసు సూపర్నెంటు, డిప్యూటీ కలెక్టరు, సర్కిల్ యింకా కొంత మంది పోలీసులు వచ్చి, ఊరి వెలపల ఉన్న ఒక తోపులో మకాంచేశారు. కూలీలకు కావలసిన కూలి రేటు యెంతఅని అడిగితే, 8 అడ్డలు యిప్పించ మన్నారు. ఈ రేటు కోవూరు, నెల్లూరు తాలూకాలలో దొరికే కూలీలో సగం. భూస్వామిని అడిగితే, ఆకూలి రేటు యివ్వలేం అని పలికాడు. చుట్టుపక్క గ్రామాలవారిని విచారిస్తే కూలీలు కోరిన రేటు భూస్వాములు—రైతులు యిస్తూన్నట్టు తేలింది. పోలీసు సూపర్నెంటు, భూస్వామి చాటుకువెళ్ళి, ఏవేవో అరగంటసేపు మాట్లాడుకున్నారట! మాట్లాడుట పూర్తికాగానే సూపర్నెంటుగారు వచ్చి, కూలీలు సమ్మె చేయడమే తప్పని వాదించ సాగారు. ఇదివరకు యిస్తూన్న కూలి (6 అడ్డలు) తోనే సంతృప్తి చెందాలని చెప్పి వెళ్ళిపోయారు. ఆఫీసర్లు యీవిధంగా మాట్లాడినందువల్ల భూస్వాములు చంక లెగరేస్తున్నారు. కూలీలు యేడుస్తూ ఇండ్లకు పోయారు.

కాబట్టి, పోలీసు ఉద్యోగస్థులను సమ్మె పరిష్కారం చేయుటకు జిల్లా ఆఫీసర్లు పంపకుండా ఉండే మార్గం కూలీలు ఆలోచించాలి. అట్టి రాజీ సంభాషణలకు తాము పోకూడదు. రైతు, కూలీ సంఘ ప్రతినిధులతో కూడిన సంఘమే సమ్మెలను పరిష్కారం చేసేలాగు చూచుకోవాలి. సామ్రాజ్యవాదుల గులాంలు సాధారణంగా ధనిక భూస్వాముల వైపునకే మొగ్గుతారు.

## యు. పి. జమీందార్ల రాయబారం

యు. పి. రాష్ట్రీ జమీందార్లు 21-9-38 వ తేదీని ఛత్తారీ నవాబ్‌గారి నాయకత్వమున ఢిల్లీ వెళ్ళి, కాంగ్రెసు పార్లమెంటరీ సబ్ కమిటీవారితో తమ "యిబ్బందు"లను గురించి మొఱపెట్టుకున్నారు. యు. పి. రైతాంగపు బిల్లు ప్రకారం భూములపై తమకుగల సొంత శేరీ హక్కును కాంగ్రెసు ప్రభుత్వంవారు లాగివేయుచున్నారనీ, జమీందార్ల అనుమతి లేకుండా రైతులు తమ భూములలో చెట్లు పెంచడానికి యెట్టి హక్కు ఉండకూడదనీ, రైతులను జమీందారీ భూముల నుండి తొలగించుటకు బిల్లులో చేయబడిన షరతులు జమీందార్లకు హానికరమనీ వారు కాంగ్రెసు నాయకుల యెదుట తమ అసమ్మతిని తెలియజేశారు.

కాంగ్రెసు నాయకులు రాయబారులు చెప్పిన దంతా విన్నారు. తమ అభిప్రాయం వెల్లడించలేదు.

యు. పి. రాష్ట్రీ కాంగ్రెసు కమిటీవారిచే నియమింపబడిన టెనెన్సీ బిల్లు ఉపసంఘం కూడా సమావేశమై, ఒక తీర్మానం ప్యాస్ చేశారు. కాంగ్రెసు పార్లమెంటరీ సబ్ కమిటీ వారు జమీందార్లతో రాజీ చేసుకోవడానికి ఆరాటపడు చున్నందుకు తమ విచారమును తెలియజేస్తూ ఉపసంఘంవారు తీర్మానించారు. పార్లమెంటరీ సబ్‌కమిటీకి అన్ని విషయాలలో కాంగ్రెసు పార్టీకి సలహా యిచ్చుటకు హక్కు ఉన్నప్పటికీ, కాంగ్రెసు ప్రభుత్వంగాని, కాంగ్రెసు పార్టీగాని కోరనిదే, అలా చేయడానికి వీలులేదనిన్నీ ఎన్నికలప్పుడు రైతులకు చేసిన వాగ్దానాలను కాంగ్రెసు పార్టీగాని, కాంగ్రెసు ప్రభుత్వంగాని నెరవేర్చకపోతే కాంగ్రెసు పలుకుబడి రాష్ట్రంలో పూర్తిగా నశిస్తుందనిన్నీ తీర్మానంలో తెలియజేయ బడింది. ప్రభుత్వం వారు తలపెట్టిన మార్పులు చాలా సామాన్యమైనవనీ, రైతుల కష్టాలను పూర్తిగా తొలగింప జాలినవి కావనీ తీర్మానం తెల్పుతోంది. అయినప్పటికీ, జమీందార్లంతా ఏకమై, కాంగ్రెసు మీద కత్తి కడుతున్నారు. రైతులకేవో క్రొత్త హక్కులు సంక్రమించి పోతవని జమీందార్లు వారిని బలవంతంగా భూములనుండి తొలగిస్తున్నారు. కాంగ్రెసు ప్రభుత్వానికి అడ్డంకులు కల్పించే నిమిత్తం తయారై, యీ జమీందార్లు అనేక దౌర్జన్యాలు చేస్తున్నారు. వీరిని సంతృప్తి పరచే ఉద్దేశంతో ప్రభుత్వం చాలా దూరము ఆలోచించి, ఒక రాజీ మార్గాన్ని అవలంబించారు. ఇప్పటికే రైతుల్లో ఆందోళన అధికమైంది. పార్లమెంటరీ సబ్ కమిటీవారు జమీందార్లతో రాజీ మాటలు కట్టిపెట్టాలి. లేకపోతే చాలా ప్రమాదకరమైన పరిస్థితు లేర్పడగలవని తీర్మానంలో ఖండితంగా తెలియజేయ బడింది.

జమీందార్లతో ఒడంబడికలు.

కాంగ్రెసు మంత్రులు అధికారంలో ఉన్న రాష్ట్రాలలో జమీందార్లతో జరిగే ఒడంబడికలను గురించి అ. భా. రైతు సంఘాధ్యక్షులైన సహజానంద సరస్వతిగారు యీ క్రింది విధముగా వ్రాస్తున్నారు.

"బీహారు ప్రథమ కబళమైంది. అటుపిమ్మట బొంబాయి, మదరాసు మంత్రివర్గం నియమించిన జమీందారీ విచారణ సంఘంవారి రిపోర్టును ప్రకటించడంలో జరిగే ఆలస్యాన్ని చూస్తే, యీ భూతం (ఒడంబడికలు) అక్కడ కూడా ప్రవేశించినదా అని అనుమానం కల్గుతోంది. ఎంతో మెక్కువగా పొగడబడుచున్న ఒరిస్సా రైతాంగపు చట్టాన్ని చూచినా, - అది బీహార్ బిల్లుకి మక్కికి మక్కి - ఇప్పటివరకు ఒక యు. పి. రాష్ట్రంలోనే ఇది ప్రవేశించలేదు. జమీందార్లతో రాజీకై మౌలానా అబ్దుల్ కలాం అజాద్‌గారి సహాయం తీసుకొన వలసిందని కొందరి సలహాకు అక్కడి పెద్ద నాయకులు కొందరు "సంయుక్త పరగణాలు బీహార్ కాదు" అని జవాబిచ్చినట్లు విన్నాను. కాని ఉన్నట్లుండి కాంగ్రెసుపార్టీ అంగీకారంతో, ప్రధాని గోవింద వల్లభ పంతు జమీందార్లతో అప్పుడే ఒక రాజీ చేసుకున్నట్లు. యీ నెలాఖరు లోగానే దాన్ని సర్దార్ పటేల్ ముందుపెట్టి, తుది నిర్ణయానికి వస్తారనీ వార్తలు వస్తున్నాయి.

"కాంగ్రెసు ఈ విధంగా జమీందార్ల చప్పళ్ళకు భయపడి, రైతులకు తెలియకుండా, రాజీపడుట రైతులకు ద్రోహం చేయుట తప్ప మరొకటి కాదు. ఎన్నికలకు పూర్వమే ప్యాసయిన ఫెయిజ్‌పూర్ రైతాంగ కార్యక్రమం మీదనే ఎన్నికలలో ప్రచారం జరిగింది. కనుకనే కాంగ్రెసు అపూర్వమైన విజయాన్ని పొందింది. 7 రాష్ట్రాలలో కాంగ్రెసు అధికారంలో ఉన్న యిప్పుడు ఆ కార్యక్రమాన్ని సంకుచిత పరచుటకు గాని, పెడార్థాలు తీయుటకు గాని ఎంతటి గొప్పవారికైనా హక్కు లేదు. జమీందార్లతో రాజీలు యీ కార్యక్రమంలో లేనేలేవు..... కాంగ్రెసు ప్రతిష్ఠ భగ్నం అవుతోంది. ప్రజా సామాన్యంలో కాంగ్రెసు పలుకుబడి సన్నగిలుతోంది. కాబట్టి, ఆ జాతీయ సంస్థను ప్రేమించే, గౌరవించే, అందరికీ నేనొక విజ్ఞప్తిని చేస్తున్నాను. ప్రధాన సమస్యలపై ధనిక వర్గాలతో రాజీపడే స్వభావాని కెదురు తిరగండి. ఇప్పు డమలులో ఉన్న రాజీలను చీల్చి చెండాడండి. ఈ విధంగా కాంగ్రెసు సంస్థ యొక్క గౌరవాన్ని, పలుకుబడిని కాపాడండి."

రంగాగారి స్టేట్‌మెంటు.

ఈ సందర్భంలో అ. భా. రైతు సంఘ కార్యదర్శి ప్రొఫెసర్ రంగాగారీ క్రింది ప్రకటన చేశారు:

"ఈ జమీందార్లు ఎంత యెదురు తిరుగుతున్నప్పటికీ, ప్రజా సామాన్యాన్ని ఎంత నిరంకుశంగా బాధిస్తూ ఉన్నప్పటికీ, దేశమందలి రైతులు, కూలీలు కాంగ్రెసు సంస్థను బలపరుస్తూనే ఉన్నారు. కాంగ్రెసు ఆమోదించిన రైతాంగ కార్యక్రమాన్ని వారు అంగీకరించారు. కాంగ్రెసు యిచ్చిన వాగ్దానాల్ను వారు పూర్తిగా విశ్వసిస్తున్నారు."

## సరిహద్దులో శిక్షలు

సరిహద్దు రాష్ట్రం (కాంగ్రెసు)లో రైతుల సత్యాగ్రహ సందర్భంలో ఎరస్టు చేయబడిన వారికి 161 మందికి ఒక్కొక్కరికి 6 నెలల చొప్పున, 14 గురికి 2 సంవత్సరముల చొప్పున, కఠిన శిక్షలు విధించబడ్డాయి. 24 గురిని మేజస్ట్రేటు మందలించి విడిచిపెట్టాడు. 25 గురిపై సెక్యూరిటీ కేసులు పెట్టబడ్డాయి.

# హిట్లర్ కోరిన క్రొత్త కోర్కెలు.

## జకోస్లోవేకియా, యూరోపు పటంలో ఉండటమో, ఊడటమో అక్టోబరు 1 న తేలుతుంది.

జకోస్లోవేకియా శాంతి కోసరం ఎంత త్యాగం గావించినా సరిపోలేదు. హిట్లర్ మళ్ళా కొన్ని కోర్కెలు కోరాడు. ఈ కోర్కెలను గురించి విమర్శించేముందు ఈ వారంలో జరిగిన ఘటనలను విచారించుదాం.



హిట్లర్‌కు తాళం వేస్తున్న ముస్సోలినీ

## ఛాంబర్లేన్ రెండవ ప్రయాణం

ఛాంబర్లెయిన్ రెండోసారి హిట్లర్ వద్దకు పరిగెత్తాడు. ఈసారి కూడా పైపై మర్యాదలు వాగానే జరిగాయి: ఛాంబర్లెయినును జర్మనులు



సుడెటను జర్మనుల నాయకుడు హెన్లిన్

మెచ్చుకోవడం కూడా జరిగింది. కాని ఈసారి హిట్లర్ కోర్కెలు హెచ్చాయి. బ్రిటిష్ ఫ్రాంసులు కలిసి. జక్ మెడను వంచి ఒప్పిద్దామను



ఫ్రెంచి సైన్యాలను అయుత్త పఱచుచున్న జనరల్ జోసెఫ్ వూయిల్లెమిన్

కొన్న కోర్కెల కంటె హిట్లర్ అధికం కోరాడు. ఈ భారమైన మూటను మోసుకు వచ్చాడు ఛాంబర్లెయిను. రాత్రింబవళ్ళు బ్రిటిష్ మంత్రివర్గం ఈకోర్కెల చర్చింది.

## ఫ్రాంసు వైఖరి

బ్రిటిష ప్రధాని తీసుక వచ్చిన ఈ 'ముల్లె'ను ఫ్రాంసుకు చూపెట్టాలని, ఫ్రెంచి ప్రధానిని పిలిపించారు. ఫ్రెంచి ప్రధాని దలదీర్, బోనెటు, లండన్ వెళ్లారు. బ్రిటిషు, ఫ్రెంచి మంత్రులు దీర్ఘంగా చర్చించి, దానిని జకోస్లోవేకియాకు పంపారు.

ఫ్రాంసు ఇదివరకు లొంగి నందులకే ప్రజలలో అసమ్మతి ప్రబలింది. ఫ్రాంసు ఒక ప్రక్క సంధి ప్రయత్నాలు చేస్తూ, యుద్ధ సన్నాహాలు కూడా గావించుతున్నది. సైన్యాలను పిలిపించడం ఇందులో ఒకభాగమే.

రాడికల్ సోషలిస్టు పార్టీ ప్రతి నిధులకు జవాబిస్తూ ఫ్రెంచి ప్రధాని, సంధి ప్రయత్నాలు భగ్నమైతే తప్పక జకోస్లోవేకియాకు సహాయం చేస్తా నన్నాడు.

## ఇటలీ వైఖరి

ముస్సోలినీ రోజు రోజుకూ ఒక ప్రకటన గావిస్తున్నాడు. ముస్సోలినీ తటస్థంగా ఉంటాడనుకొనే వారికి నిస్పృహ కల్గించాడు. ప్రజా స్వామ్య ప్రభుత్వాలరోజులు పోయినవనీ,జర్మనీకి సహాయంచేయడానికి తాను సిద్ధంగానున్నాననీ ముస్సోలినీ అన్నాడు. మరొకసారి "డాక్టర్ బీనిస్ అధికారాన్ని జకోస్లోవేకియాపై నిలబెట్టడాని కని, యూరపునంతా యుద్ధంలో ముంచడం తెలివి తక్కువ" యనీ అంటున్నాడీ దయార్ద్ర హృదయుడు. అన్ని దేశాలు యుద్ధానికి తయారవుతూంటే తా మెందుకు మానాలి అని తానూ సిద్ధమౌతానని ముస్సోలినీ చెప్పాడు.

## ప్రపంచాభిప్రాయం

గవర్నమెంటు పత్రిక అని చెప్పదగిన 'టైమ్సు' పత్రికే నేడు నిస్పృహ చెందింది. ఫ్రాంసు బ్రిటన్‌లు గట్టిగా నిలబడి, ఇద్దరూ హిట్లర్ వద్దకు పోయి తాము తమ ప్రాత సూచనలకే కట్టుబడి వుంటామని చెప్పవలెనని చెప్పుతున్నది. నేడు ప్రపంచ సానుభూతి అంతా జకోస్లోవేకియాకే ఉన్నది. కార్మికులు, లిబరల్స్, మాత్రమే గాక కన్సర్వేటివ్ పక్షంలో కూడ కొందరు జక్ ప్రభుత్వానికే సానుభూతి చూపెడుతున్నారు. ఈ మధ్యనే 10 వేల ప్రజలు బ్రిటన్‌లో హైడ్‌పార్కులో 'ఛాంబర్లేను పోవాలి,జక్‌ప్రభుత్వపక్షాన నిలబడాలి'అని కేకలు వేశారు, ఇంతేగాదు. ప్రతివాడూ, "ఇదివరకు ఏదో లొంగాము. ఇక లొంగరాదు." అని తలచు తున్నాడు. రవీంద్రనాధ టాగూర్ సైతం ఎంతో ఆవేదనతో జకోస్లోవేకియాకు ద్రోహం జరుగుతున్నదని, బీనెస్‌కు సానుభూతిని తెలియజేశాడు.ఈసానుభూతిని ఆధారంచేసికొని,ఫ్రెంచి బ్రిటిష్ కార్మిక వర్గం సరిగా ప్రవర్తించితే జక్‌కింత ద్రోహం జరుగదు.

## రష్యా సహాయం

రష్య మాత్రం - ఎవ్వరేమైనా తన మాట తప్పలేదు. లీగ్ అఫ్ నేషన్సులో లిట్వినాఫ్ ఇలా అన్నాడు. "ఇక్కడ సమావేశమైన అన్ని దేశాల ప్రభుత్వాలు గాకపోయినా, అన్ని దేశాల ప్రజలు జకోస్లోవేకియాకు సానుభూతి చూపించుతున్నారు."



హెర్ హిట్లర్

ఇంతే గాక లిట్వినాఫ్ తమ సంధిని పురస్కరించుకొని ఏకాకిగానైనా సరే రష్యా జకోస్లోవేకియాను రక్షించడానికి సిద్ధంగా ఉన్నాడని తెలిపాడు.

## చిన్న దేశాల వైఖరి

ఒక ప్రక్క పోలండ్ హంగేరీలు తమకూ కొన్ని హక్కులున్నాయంటూ, ఆందోళన చేయ సాగాయి. సుడెటన్ జర్మనులకు లాగానే తమకు కూడా హక్కు లిప్పించమని కోరినయి. పోలండ్ తమ కోర్కెల జక్ ప్రభుత్వానికి తెల్పింది. త్వరగా సమాధానం ఈయమని హెచ్చరించింది, పోలండులో 10 వేల వలంటీర్లు హడావిడి చేస్తున్నారు.

ఈ హడావిడిని చూస్తున్న రష్యా సహించలేకపోయింది. జకోస్లోవేకియా జోలికి పోలండ్ వస్తే, తనకు దానితో ఉన్న సంధిని వదలివేస్తానని బెదరించింది. పోలండ్ రష్యాలు ఇదివరకు "నాన్ అగ్రెషన్" (నాక్రమణ) సంధి గావించుకొన్నాయి. రష్యా చేసిన ఈ బెదరింపుకు పోలండ్ భయపడవచ్చు. "ఇది మాకు ఆశ్చర్యం గల్గించుతున్నది" అని మాత్రమే పోలండు అనగల్గింది కాని మరేమీ చేయలేక పోవడానికి కారణం ఇదే.

ఇక హంగేరీ బెదరింపులకు రుమేనియా జవాబు చెప్పనే చెప్పింది. హంగేరీ జక్‌పై దండెత్తితేరుమేనియా ఎదుర్కొంటానికి తయారుగా ఉందని తెల్పింది.

## జకోస్లోవేకియాలో

ఆంగ్లో ఫ్రెంచి షరతులు తమకు తెలియక పోయినా, ఆనాడు జక్ ప్రభుత్వం వారికి తలయొగ్గింది. ఆనాడు ప్రజలలో నిస్పృహ తాండవించింది. కొందరు పిచ్చిగా పాటలు పాడ

# నేటి ప్రపంచం

సాగారు. కొందరు కేకలు వేయసాగారు. మరి కొందరు ఏడ్వసాగారు. జక్ ప్రభుత్వ ప్రకటన ఇలా ఉన్నది.

"బ్రిటన్ ఫ్రాంసులు ఓడిపోయిన దేశాలపై ఒత్తిడి తెచ్చినట్లు ఒత్తిడి తెచ్చాయి. మేము ఓడిపోలేదు. అయినా రక్తపాతం, అశాంతినీ తప్పించడానికి మేము లొంగిపోయాం. మానవత్వం రక్షించడానికి క్రీస్తు తనను బలి గావించాడు. మేము ప్రపంచ శాంతికి బలి గావించుచున్నాం. తప్పు ఎవరిదో మేము చెప్పదలచుకోలేదు. భావి చరిత్రే నిర్ణయిస్తుంది." ఈ ప్రకటన ఏ మానవుని కదల్చదు. బ్రిటన్ ఫ్రాంసుల ద్రోహం స్పష్టంగా దానిలో గన్పించుతున్నది.

జకోస్లోవేకియా అధ్యక్షుడగు డాక్టర్ బీనిస్ సైన్యాలన్నిటినీ సిద్ధపరచుతూ ప్రజల కందరికీ ఒక ఆజ్ఞ గావించాడు. "జనరల్ మాబిలైజేషన్"కు ఆర్డరిచ్చాడు. ఆ ఆర్డరు ఉత్సాహంతోనూ, ఆనందంతోనూ అంగీకరించబడింది.



డాక్టర్ బీనెస్

కాని సుడెటన్ జర్మనుల నాయకుడగు హెన్లిన్ దీనిని వ్యతిరేకిస్తూ తన పార్టీకి ఒక హెచ్చరిక గావించాడు. "బీనెస్ ప్రకటన చట్ట విరుద్ధం: మీరు దీనిని తిరస్కరించండి. మీ సోదరుల రక్తాన్ని మీరు చవిజూడకండి, త్వరలోనే మీకు స్వేచ్ఛ లభించుతుంది."

ఈ ప్రకటన ఫలితంగా సుడెటన్లు బీనెస్ ఆర్డరును గౌరవించ లేదు.

ఇక సుడెటన్ ప్రాంతాలలోను–సరిహద్దులలోను అల్లరులు జరుగుతూనే ఉన్నాయి. జక్ పోలీసులను నిరాయుధులను గావించి నాజీ పతాకాలను గూడ ఒక రోజున స్థాపించారు. కాని ప్రభుత్వం తిరిగి ఆ స్థానాలను ఆక్రమించుకొంది. వలంటీర్ల పేరిట జర్మను సైన్యాలు సరిహద్దుల దాటు తున్నాయి. సుడెటన్లు అపుడే 1 లక్ష 70 వేల మంది జర్మనీలోకి పారిపోయారని జర్మనీ వార్త. హెన్లిన్ ప్రేరేపించిన అంతర్యుద్ధం తగ్గలేదు. ప్రభుత్వపు జాగరూకత వల్ల అంతా కట్టుదిట్టంగానే ఉంది. ప్రభుత్వం ఒక ప్రకటన ద్వారా "అశాంతిని అణచడానికే ఆయుధాలు ప్రయోగించు తున్నాం" అని చెప్పింది. కాని జర్మనులు రేడియోల ద్వారా బీనెస్‌ను తిట్టడం మానలేదు.

జకోస్లోవేకియా మంత్రి వర్గంలో మార్పులు జరిగాయి. కాని ఈ మార్పుల వలన ప్రభుత్వం ఏమీ బలహీన పడదు. పైగా బలపడు తుంది. డాక్టర్ హోడ్జా ప్రధానామాత్య పదవికి రాజీనామా నిచ్చాడు, "జకోస్లోవేకియా ఉక్కు మనిషి" అని పేరుపొందిన "జనరల్ సిరోవీ" ప్రధాని అయాడు. డాక్టర్ క్రోఫ్టా విదేశాంగ మంత్రిగను, కాల్ఫస్, ఆర్థిక మంత్రిగాను నియమింప బడ్డారు. వీరుగాక మరి ముగ్గురు, మంత్రులు 'పోర్టుపోలియా' లేకుండా ఉంటారు. మరి ఇద్దరు స్లొవాక్ మంత్రులను కూడ చేర్చుకొన్నారు. ఇందులో సెర్నాక్ అను నతడు అటానమిస్టు పార్టీకి చెందిన నాడు. ఈ క్లిష్ట పరిస్థితులు ప్రారంభమయిన మొదటి దినాలతో ఇతడు కూడా హెన్లిన్‌ను సపోర్టు చేశాడు. కమ్యూనిస్టులతో పోరాడాడు. ఇపుడు పూర్తిగా ప్రభుత్వ పక్షం వహించాడు. ఇది కొంతవరకు శుభసూచనే, ఇక ఏమీ ద్రోహం చెయ్యకుండా ఉంటే. ఇదిగాక మరొక రాజకీయ కమిటీ ఉంటుంది. అది అంతరంగికంగా పనిచేస్తుంటుంది. దానిలో పూర్వపు ప్రధాని హోడ్జా కూడా ఉన్నాడు.

నూతన మంత్రివర్గం ఏర్పడినాక హోడ్జా "తన బాధ్యత ఇంకా వదలలేదనీ, అవసరమైనపుడు, దేశానికీ, జాతికీ సహాయం గావించడానికి సంసిద్ధంగా ఉన్నాననీ" తెల్పాడు.

జనరల్ సిరోవీ స్థానే ఇపుడు జనరల్ క్రెజ్సీ కమాండర్ ఇన్ చీఫ్ అయాడు.

మొత్తం మీద జక్ ప్రభుత్వం పరిస్థితుల నన్నిటినీ జాగ్రత్తగా చూస్తూ, కంట్రోల్‌లో పెట్టుతున్నది.

## జర్మనీ — జకోస్లోవేకియా

| జర్మనీ | జకోస్లోవేకియా |
| --- | --- |
| జనాభా 73,000,000 | 15,000,000 (సుడెటన్ జర్మనులతోసహా) |
| విస్తీర్ణం 214,068 చదరపు మైళ్ళు. | 54,244 చదరపు మైళ్ళు. |
| సైన్యం (రిజర్వుతో సహా) 5,500,000. | 1,875,000. |
| యుద్ధ విమానాలు 2,000. | 600. |
| సేద్యపు భూమి 76,682,056 ఎకరాలు. | 20,236,030 ఎకరాలు. |

## హిట్లర్ హిరణ్యాక్ష వరాలు

హిట్లర్ కోరిన క్రొత్త కోర్కెలు జక్ ప్రభుత్వం ఆలోచించి సమాధానం పంపింది. ఏమి పంపినదో తెలియదు. జకోస్లోవేకియా యొక్క ఈ సమాధానాన్ని బట్టి, బ్రిటన్ ఫ్రాంసుల వైఖరీ, దాని ననుసరించే హిట్లర్ వైఖరీ ఆధారపడి వుంటుంది. ఇంతకూ హిట్లర్ కోరిన హిరణ్యాక్ష వరాలేమిటి? అవి ఇవి.

(1) పటంలో కొన్ని గీతలు గీసి హిట్లర్ ఇవి నావి అన్నాడు. ఆ ప్రదేశాలనుండి (సుడెటన్ ప్రదేశాలు) జక్ సైనికులు, పోలీసులు, ఇతర ఉద్యోగీయులు వెళ్ళి పోవాలి. (2) ఈ ప్రదేశాలలోని, మిలటరీ, ఆర్థిక పరిస్థితులను యధావిధిగా, మార్పు లేకుండా అక్టోబరు ఒకటవ తేదీకి, జర్మనీకి యిచ్చి వేయాలి. ఈ ప్రదేశాల నుంచి, జక్కు సైన్యాలు వెళ్ళడానికి తగిన ఏర్పాట్లు, జక్కు జర్మన్ మిలటరీ ప్రతినిధులు కలిసి చేయడానికి జర్మనీ ఒప్పు కొంటుంది. (3) జక్ సేనలలో, పోలీసు దళాలలోని సుడెటనులను తక్షణం వదలాలి. వారు తమ ప్రదేశాలకు పోవడానికి అనుమతినియ్యాలి. (4) జర్మను రాజకీయ ఖైదీలను వదలి వేయాలి. (5) మరికొన్ని ప్రదేశాలలో నవంబర్ 25 వ తేదీలోగా ప్లెబిసైటు తీసుకోవాలి. ఈ ఎన్నికల ఫలితంగా ఏర్పడే క్రొత్త సరిహద్దుల నిర్ణయించడానికి జక్ జర్మన్ కమీషనుగాని అంతర్జాతీయ కమీషనుగాని నియమించాలి. ఎన్నికలపుడు ఆయా సైన్యాలను వెనక్కి మరల్చాలి.

దీనిని బట్టి తేలేదేమిటి? హిట్లర్ గీటు పెట్టిన ప్రదేశాలు చూడనక్కర లేదు. ఆ షరతులకు జక్ ప్రభుత్వం ఒప్పుకోవడం అంటే జక్ ప్రభుత్వం హిట్లర్ దయాదాక్షిణ్యాలపై బ్రదకడం అన్నమాట. రాజకీయంగానే గాక, ఆర్థికంగా జర్మనీ దోచుకోవడం ఒక యెత్తు. మిగిలిన జకోస్లోవేకియాను విడదీసి బలహీన మొనర్చుట రెండో యెత్తు. ఈ రెండు ఎత్తుల ద్వారా, జకోస్లోవేకియాను ఎన్నటికైనా మ్రింగాలని హిట్లర్ మూడవ యెత్తు. హిట్లర్ ఆశ యింతటితో ఆగదు. డాన్యూబియన్ ప్రాంతాలను - ఆ తర్వాత రష్యాలోని యుక్రైన్‌ను కబళించాలని హిట్లర్ కోరిక.

ఈ షరతులు బ్రిటన్ ఫ్రాంసు సూచనల కన్న అధ్వాన్నంగా ఉన్నాయని వేరే చెప్ప నవసరం లేదు. అవి జర్మనీకి అప్పగించగా, మిగిలిన జకోస్లోవేకియా రక్షణకై లొకార్నో వంటి సంధి సంగతి తెల్పాయి, హిట్లర్ ఆవిషయమే ఎత్తలేదు. ఒకవేళ హిట్లర్ కాపాడతానని ఈనాడన్నా, నమ్మకం ఏమిటి?

ఈ కోర్కెలను జక్ ప్రభుత్వం తిరస్కరించాలి. బ్రిటన్ ఫ్రాంసులు గజ గజ లాడకుండా జర్మనీని బెదరించాలి. రష్యాతో కలసి జక్‌ను రక్షించాలి. ఛాంబర్లెయిను రాజనీతి అంతటి వివేకానికి దారి తీయడం లేదు. ఆలా చేయాలంటే ఫ్రాంసు బ్రిటన్లలోని కార్మికవర్గం ఒత్తిడి తేవాలి.

ఛాంబర్లెయిను హిట్లరుకు మరొక ఉత్తరం వ్రాశాడని కడపటి వార్త. అది ఏమైనా,



యుద్ధ సన్నాహాలచే క్రుంగిపోతున్న జర్మను కార్మికుడు

ఒకటే పాఠం. జకోస్లోవేకియా బలిఅయిందా, ప్రపంచ శాంతికే భగ్నం. హిట్లర్ లొంగాడా



రాజీనామా నిచ్చిన, జక్ ప్రధాని హోడ్జా

ఫేసిజానికే పెద్ద దెబ్బ. అందుకనే ప్రపంచ భవితవ్యం అంతా జకోస్లోవేకియా పైన ఉంది.



నూతన ప్రధాని జనరల్ సిరోవీ

# దేవదాసు

శరత్ బాబు

విరచితం

## పూర్వకథ

పార్వతీ, దేవదాసూ చిన్ననాటి నుండి స్నేహంగా పెరిగారు. పార్వతీ దేవదాసులు ఒకరి నొకరు ప్రేమించుకొన్నారు.

దేవదాసు తండ్రి నారాయణ ముఖర్జీ జమీందారు. పార్వతి తండ్రి నీలకంత చక్రవర్తి పిల్లల నమ్ముకొనే కుటుంబమువారు.

అందుకనే దేవదాసు తలిదండ్రులు పార్వతిని తమ అబ్బాయికి వివాహం చేయ తిరస్కరించుతారు.

నీలకంత చక్రవర్తి రోషపడి ఒక జమీందారు సంబంధం కుదుర్చుతారు. రెండో పెండ్లి, 40 ఏండ్లు, పేరు భువన చౌదరి.

ఈవార్త విని దుఃఖించిన పార్వతి ఒక రాత్రి ఒంటరిగా దేవదాసు గది ప్రవేశించి తనను పెండ్లాడమంటుంది. పార్వతిని ఓదార్చి పంపుతాడు దేవదాసు.

తలిదండ్రుల నిర్బంధం వల్ల కలకత్తా చదువుకు వెళ్ళాడు దేవదాసు. తనను మరచిపొమ్మనీ, తనకు పార్వతిపైన ప్రేమలేదనీ వ్రాశాడు పార్వతికి. కాని మనసు మనసులో లేదు.

హఠాత్తుగా ఇంటికి వెళ్ళాడు. తలిదండ్రులు ఆశ్చర్యపడ్డారు. కాని ఏదో సమాధానం చెప్పుకొన్నారు.

దేవదాసు నదికి షికారుకు వెళ్ళినపుడు పార్వతిని కలిసికొంటాడు. తన తల్లి దండ్రులను ఎలాగో ఒప్పించుతానని తెల్పుతాడు.

పార్వతి రోషపడింది. తనకూ తలిదండ్రు లున్నారని అంది. ఛీ అని దేవదాసును తిరస్కరించింది.

దేవదాసు కోపంతో మండిపోయి "చంద్రునికి కళంకం లాగానే నీకూఉండాలి. నీకింత రూపం ఉండటం అహంకారం తెస్తుంది" అంటూ చేతిలోని గాలం కర్రతో ముఖాన బాదుతాడు. రక్తం కారుతుంది. తన చొక్కా చీలికతో రక్తం తుడుస్తాడు. పార్వతి ఏడ్చింది. దేవదాసు తన జ్ఞాపకానికి ఇది చిహ్నం అంటాడు. మాటాడకుండా వెళ్ళబోతాడు. పార్వతి వెనక్కి పిలిచింది. కనుగొలకుల నీటి బిందువులతో దేవదాసు తిరిగి వస్తాడు. పార్వతి క్షమాపణ వేడుకొంటుంది. దేవదాసు "నీవు నా దగ్గర సుఖపడే దానివి కావు. దేవదాసు మాత్రం స్వర్గ సౌఖ్యం అనుభవించే వాడు" అంటూ ఆశీర్వదించి పోయాడు.

ఆర్భాటాలు అట్టహాసాలు లేకుండా, పార్వతీ భువనచౌదరుల వివాహం జరిగింది.

ఇక దేవదాసు కలకత్తాలో ఆరాత్రి ఈడెను గార్డెన్‌లో కాలం గడిపి ప్రొద్దున తూగుతూ, తూగుతూ బసకు వచ్చాడు. స్నేహితుడు "చున్నీ"తో తనకెవరూ లేరనీ, పోషించమనీ అడుగుతాడు. పరిస్థితులు తెలిసిన చున్నీ, ఇతని మనసు సరిగా లేదను కొని సరే నంటాడు. భోజనానికి వెళ్ళారు.

దేవదాసు రెండు రోజులు నిద్రలోనే గడిపాడు. మూడవ రోజున కొంచెం స్వస్థుడయాడు. కారు మబ్బులు ముఖంమీద చాలవరకు తొలగినట్లు కన్పించినయి.

## ఆ తరువాత

"ఇవ్వాళ నీ వంట్లో ఎలా వున్నది?" అని చున్నీ అడిగాడు.

"చాలా బాగా ఉన్నట్టుగానే ఉంది—సరే గాని చున్నీ, నువ్వు రాత్రి పూట ఎక్కడికి వెళ్తావు?"

ఇవ్వాళ చున్నీలాలు సిగ్గుపడ్డాడు.

"ఆఁ, నేనా: పోయే మాట నిజమే—ఇప్పుడా సంగతి, ఎందుకు? సరే, నువ్వింక కాలేజీకి పోవా?" అన్నాడు తడబడుతూ.

"ఊహుఁ, చదువు మానేశాను."

"ఛీ, మానేసినందువల్ల ప్రయోజనం? రెండు మాసాల్లోనే నీపరీక్ష, చదువు కూడా బాగానే చదివావు. ఈమాటు పరీక్ష కెందుకు కూర్చోవు?"

"ఊహుఁ, మానేశాను."

చున్నీలాలు ఇకేమీ మాట్లాడలేదు. దేవదాసు అడిగాడు:

"ఎక్కడికి వెళ్తావో చెప్పవూ? నేను కూడా నీ వెంట వస్తాను."

చున్నీలాలు. దేవదాసు ముఖం వంక చూస్తూ—"నీకు తెలియదా దేవదాస్! నే నంత మంచి చోటుకు పోను." అన్నాడు.

"మంచీ, చెడూ! ఏదయితే నేం?" అని దేవదాసు మనస్సులో అనుకొని—"చున్నీ! నన్ను కూడా నీ వెంట తీసుకొని పోవూ?" అని అడిగాడు.

"ఎందుకు తీసుకుపోను? నీవే రావు!"

"తప్పకుండా వస్తాను. బాగా ఉండకపోతే మళ్ళీ రాను. నువ్వు ప్రతి రోజూ ఏ సుఖం కోసమై ఇంత ఆతురతతో ఎదురు చూస్తూ ఉంటావో, అది ఎలాంటిదైనా సరే, చున్నీ: నేను తప్పకుండా వస్తాను."

చున్నీ ముఖం చాటు చేసుకొని నవ్వి—"నా సుఖమా!" అని మనస్సులో అనుకుని—"సరే, అలాగే తీసుకు పోతాను!" అన్నాడు పైకి.

మూడు ఘంటలకు సామాను తీసుకొని ధర్మదాసు వచ్చాడు. దేవదాసును చూడగానే ఏడుస్తూ—"దేవదా, అమ్మ ఈమూడు రోజుల నుంచీ ఎంత ఏడుస్తున్నది!" అన్నాడు.

"ఎందుకోయ్?"

"ఎవరితో చెప్పకుండా ఇలా ఎందుకు వచ్చావు?"అని ఒక కాగితం తీసి దేవదాసు కిచ్చి—"అమ్మగారు రాశారు!" అన్నాడు.

చున్నీ ఉత్తరంలో సంగతులు తెలుసుకోవాలని చాలా ఉత్సుకత చూపించాడు. దేవదాసు ఉత్తరం చదివి క్రింద పెట్టాడు. తల్లి ఇంటికి రమ్మని చాలా చాలా రాసింది. ఆ యింటిలో కల్లా దేవదాసు యిలా హఠాత్తుగా మాయం కావటానికి కారణం ఏమిటో కొంత వర కయినా ఊహించింది ఈమే! ధర్మదాసు చేతి కిచ్చి, చాటుగా, చాలా పైకం కూడా పంపించింది. ధర్మదాసు పైకం చేతి కిచ్చి— "ఇంటికి పోదాం, పద దేవదా!" అన్నాడు.

"నేను రాను, నువ్వు వెళ్లిపో!"

రాత్రి, మిత్రులిద్దరూ చక్కగ ముస్తాబయి బయలు దేరారు. దేవదాసుకు ఈ ముస్తాబంటే అంత ఇష్టం లేదు. కాని చున్నీలాలు మామూలు వేషంతో బయలుదేరటానికి సమ్మతించలేదు. రాత్రి తొమ్మిది గంటలకు ఒక బాడుగ బండి చిత్పూరు రోడ్డులో ఒక రెండంతస్తుల మేడ క్రింద నిలబడింది. చున్నీలాలు దేవదాసు చేయి పట్టుకుని లోపల ప్రవేశించాడు. ఇంటి ఆవిడ పేరు చంద్రముఖి—స్వయంగా వచ్చి ఆహ్వానించింది. ఆమెను చూడగానే దేవదాసు శరీరమంతా ఏవగింపుతో జ్వలించి పోయింది. ఇన్నాళ్ళ నుంచి అతనికి స్త్రీల పొడ అంటేనే గిట్టటం లేదు. ఈ సంగతి అతనికి తెలియనే తెలియదు. చంద్రముఖిని చూడగానే అతని అంతరంగంలో దాగిన ఏవగింపంతా, దావానలంవలె ఒక్క మాటు ప్రజ్వరిల్లింది. అతను చున్నీలాలు ముఖం వంక తీవ్రంగా చూస్తూ, కనుబొమలు చిట్లించుకుని" చున్నీ! నన్ని నరకానికి తీసుకొచ్చా వెందుకు?" అన్నాడు.

అతని కంఠ స్వరమూ, చూపూ చూసి చంద్రముఖీ, చున్నీలాలు స్తబ్ధు లయ్యారు. కాని వెంటనే చున్నీ తనను సంబాళించు కున్నాడు. దేవదాసు చెయ్యి పట్టుకుని మృదు స్వరంతో—"పద, లోపలికి పోయి కూర్చుందాము." అన్నాడు.

దేవదాసు ఇకేమీ అనలేదు. గదిలోకి పోయి విచారంతో తల వంచుకు కూర్చున్నాడు. చంద్రముఖి కూడా మాట్లాడ కుండా దాపుననే కూర్చున్నది. దాసీ వెండి పొదగిన హుక్కాలో పొగాకు వేసుకొని, తీసుకు వచ్చింది. దేవదాసు తీసుకో లేదు. చున్నీలాలు ముఖ మంతా భారంగా పెట్టుకుని కూర్చున్నాడు. దాసీకి ఏమి చేయాలో తెలియక, చివరికి, హుక్కా చంద్రముఖి చేతికిచ్చి వెళ్ళి పోయింది. చంద్రముఖి ఒకటి రెండు సార్లు పీల్చింది. దేవదాసు ఆమె ముఖం వంక తీక్షణంగా జూసి—"ఎంత అసహ్యం, ఎంత రోత!" అని చీదరించు కున్నాడు.

ఇంతకు పూర్వం మాటల్లో ఎవ్వరూ చంద్రముఖిని ఓడించ లేక పోయారు. అస లామెను చిన్నబుచ్చటమే చాలా కష్టం. కాని దేవదాసు హృదయంలోంచి, ఏవగింపుతో వచ్చిన ఈసరళ కఠినోక్తులు ఆమె హృదయంలోకి సూటిగా పోయి నాటినవి! ఒక్క క్షణం ఆమె మతిపోయింది. కాని, కాసేపున్న తర్వాత ఒకటి రెండు సార్లు గుడ గుడమని శబ్దం వినపడింది. పొగ మాత్రం చంద్రముఖి నోటనుంచి రాలేదు. తర్వాత హుక్కా చున్నీలాలు చేతి కిచ్చి, దేవదాసు ముఖం వంక ఒక మాటు చూసి, మౌనంగా కూర్చున్నది! ముగ్గురి నోటా మాట లేదు. హుక్కా మాత్రం 'గుడ, గుడ' మని చప్పుడు చేస్తూ ఉన్నది—అదీ భయపడుతూ, భయ పడుతూ! మిత్రులు నలుగురు కూర్చుని చర్చిస్తూ ఉండగా, ఆ చర్చ అవసరంగా కలహం క్రిందకు మారితే, చప్పున తర్కం ఆపివేసి, ప్రతి వ్యక్తి లోపల ఉండిపోతూ— "ఇలా ఎందుకు వచ్చింది?" అని ఎలా అనుకుంటారో, అలానే ఈముగ్గురూ, "ఇలా ఎందుకు వచ్చింది!" అని మనస్సులో అనుకోసాగారు.

ఎలాగైనా రానీయండి. ఇందులో ఎవ్వరికీ స్వస్థత లేదు. చున్నీలాలు హుక్కా కింద పెట్టి క్రిందకు దిగి పోయాడు. అతనికి చేసే పనేమీ కనపడ లేదు—బహుశా అందుకనే కా వచ్చును. గదిలో ఇక్కడే ఉండి పోయాడు.

"నువ్వు డబ్బు తీసు కుంటావా?" అని దేవదాసు తల ఎత్తి ప్రశ్నించాడు.

చంద్రముఖి వెంటనే జవాబివ్వలేక పోయింది. ఇప్పుడామెకు ఇరవై నాలుగో ఏడు. గత తొమ్మిది సంవత్సరాల్లో, ఎన్నో రకాలు స్వభావం కల వ్యక్తులతో ఆమెకు తగ్గ పరిచయం కూడా ఉన్నది. కాని ఇలాంటి చిత్రమైన వ్యక్తిని ఆమె ఎప్పుడూ చూడ లేదు. కొంచెము సంకోచిస్తూ అన్నది:—"తమ రాకచే గృహం పావనమైన—"

దేవదాసు మాట పూర్తి చెయ్యనివ్వకుండా—"పావనం సంగతి అలా ఉంచు; డబ్బు తీసుకుంటావా?" అని అడిగాడు.

"ఎందుకు తీసుకోను! లేకపోతే మాకెలా గడుస్తుంది?—"

"ఆగు—ఇక నేను వినదలుచుకో లేదు." అని జేబులో నుంచి ఒక నోటు తీసి చంద్రముఖి చేతిలో పెట్టి పోవటానికి ఉద్యమించాడు— ఎంత డబ్బిచ్చానని ఒక్కమాటు తిరిగి కూడా చూడలేదు.

"మధ్యలోనే వెళ్ళిపోరా రేమి?" అని చంద్రముఖి వినయంగా అడిగింది.

"చక్రపాణి"

అనువాదం

దేవదాసు మాట్లాడలేదు. వరండాలోకి వచ్చి నిలబడ్డాడు.

చంద్రముఖి ఒకమాటు, డబ్బు తిరిగి ఇచ్చివేయా లనుకొన్నది. కాని సంకోచం మూలాన ఇవ్వలేకపోయింది; బహుశా కొంచెం భయపడి ఉండవచ్చు. ఇంతే కాక తిట్లూ, తిరస్కారాలు సహించే అలవాటు ఆమెకు ఉండటం చేత, నిశ్శబ్దంగా, కొయ్యవలె ద్వారబంధము పట్టుకుని ఉండిపోయింది. దేవదాసు మెట్లు దిగి వస్తూ ఉండగా, దోవలో చున్నీలాలు ఎదురైనాడు. అతనికి ఆశ్చర్యం వేసి— "ఎక్కడికి పోతున్నావు, దేవదాస్!" అని అడిగాడు.

'బసకు వెళుతున్నాను.'

'అదేమిటోయ్!'

దేవదాసు ఇంకా రెండు మెట్లు దిగాడు.

'పద, నేను కూడా వస్తున్నాను.' అన్నాడు చున్నీలాలు.

దేవదాసు కొంచెం దగ్గరకు వచ్చి చేయి పట్టుకుని—'రా.'అన్నాడు.

'కొంచెం ఆగు, ఒకమాటు పైకి పోయి వస్తాను.'

'కాదు. నే నిప్పుడే పోవాలి. నువ్వు తర్వాత రా.' అని దేవదాసు వెళ్ళిపోయాడు.

చున్నీలాలు పైకి వచ్చాడు. చంద్రముఖి తలుపు పట్టుకుని ఇంకా అలానే నిలబడి ఉన్నది. చున్నీని చూడగానే—'నీ స్నేహితుడు వెళ్ళిపోయాడా?' అని అడిగింది.

'ఆఁ.'

చంద్రముఖి చేతిలోని నోటు చూపిస్తూ—'ఇది చూశావా? మర్యాద దక్కించుకోవాలంటే, ఇది తీసుకెళ్ళి నీ స్నేహితుని కివ్వు' అన్నది.

'అతని ఇష్టమై యిచ్చి పోయాడు. నేను మళ్ళీ ఎందుకు తీసుకెళ్ళి ఇస్తాను?'

ఇంతసేపటికి చంద్రముఖి కొంచెం నవ్వగలిగింది. కాని ఆనవ్వులో ఆనందం లేదు.

'ఇష్టమై ఇచ్చి పోలేదు. నేను డబ్బు తీసుకుంటాననే కోపంతో ఇచ్చి పోయాడు. సరే గాని, చున్నీబాబూ! అతని కేమన్నా పిచ్చా?'

'ఏమాత్రం లేదు. కాని కొన్నాళ్ళ నుంచి అతని మనస్సు సరిగా ఉండటం లేదనుకుంటాను.'

"ఎందుకు సరిగా ఉండటం లేదో నీ కేమన్నా తెలుసునా?"

"తెలియదు. బహుశా ఇంటి దగ్గర ఏదన్నా జరిగి ఉంటుంది."

"అయితే ఇక్కడికి ఎందుకు తీసుకొచ్చావు?"

"నేను తీసుకు రాలేదు. అతనే బలవంతాన వచ్చాడు."

చంద్రముఖికి ఈమాటు నిజంగా విస్మయం కలిగింది—"బలవంతాన వచ్చాడా? అంతా ఎరిగే!" అన్నది.

చున్నీలాలు కొంచెం ఆలోచించి—"అంత కాక! అతనికి అంతా తెలుసును. నేను మోసపుచ్చి తీసుకు రాలేదు." అన్నాడు.

చంద్రముఖి కొంచెంసేపు మాట్లాడ లేదు. కాసేపు ఏదో ఆలోచించుకుని—"చున్నీ! నా కొక సహాయం చేసిపెడతావా?" అని అడిగింది.

"ఏమిటి?"

"నీ స్నేహితుడు ఎక్కడ ఉంటాడు?"

"నా దగ్గరే."

"ఇంకోమాటు అతన్ని తీసుకు రాగలవా?"

"బహుశా తీసుకురాలే ననుకుంటాను. ఇంతకు ముందు ఇలాంటి చోటి కెప్పుడూ రాలేదు. ఇక ముందు కూడా రాడనుకుంటాను. సరే గాని, ఎందుకో కాస్త చెప్పు వింటాం?"

చంద్రముఖి మ్లానహాసంతో—"చున్నీ! ఎలాగైనా, ఆఖరికి మోసగించైనా అతన్ని ఇంకోమాటు తీసుకురా!"

చున్నీ నవ్వి—"చీదరింపుతో ప్రేమ పుట్టుకు వచ్చిందా ఏమిటి?" అని కన్ను కొట్టుతూ అడిగాడు.

చంద్రముఖి కూడా నవ్వింది—"చూడకుండానే నోటు పారేసి పోయాడు! ఇంకా గ్రహించనే లేదా?" అన్నది.

చున్నీలాలు చంద్రముఖిని కొంత వరకు అర్థం చేసుకున్నాడు. తల తిప్పుతూ—"వద్దు, వద్దు. ఆ రకం మనుష్యులు వేరు: అట్టే పెట్టుకో: కాని నిజమేమిటో నాకు చెప్పుతావా అన్నాడు."

"నిజంగానే అతని మీద నాకు కొంత మమత కలిగింది."

చున్నీకి నమ్మకం కలగ లేదు—"ఈ అయిదు నిమిషాలకేనా?" అన్నాడు నవ్వుతూ.

ఈ మాటు చంద్రముఖి కూడా నవ్వుతూ—"ఆఁ—అతని మనస్సు సరిగా ఉన్నప్పుడు ఒక మాటు తీసుకురా, చూడాలి! తీసుక వస్తావా?" అని అడిగింది.

"ఎలా చెప్తాను!"

"నా మీద ఒట్టు!"

"సరే చూస్తాను!"

## ౧౦

పార్వతి అత్తగారింటికి వచ్చి చూసింది—ఇల్లు చాలా పెద్దది. కాని ఆధునిక పద్ధతి కాదు. అంతా పురాతన ఫక్కీ, అంతఃపురము వేరుగా ఉన్నది. పూజా గృహము, నాట్యశాల, భండార గృహము, కచేరీ చావిడి; ఎంతో మంది దాస దాసీలు!—పార్వతి విస్తు పోయింది. భర్తగారు జమీందారనీ, భాగ్యవంతులనీ ఆమె విని ఉన్నది, కాని ఇంత ధన వంతులని తలచ లేదు. ఇక లోటల్లా మనుష్యులే; ఆత్మీయులు ఎవరూ లేరు. అంతఃపురమంతా జన శూన్యం! పార్వతి కొత్త పెళ్ళి కూతురు. ఒక్క మాటే గృహిణి అయి కూర్చున్నది. ఆమెను ఆహ్వానించి ఇంట్లోకి తీసుకు పోవటానికి, ఒక ముసలి మేనత్త మాత్రం ఉన్నది. ఈమెను మినహాయిస్తే అంతా దాస దాసీలే.

సాయం కాలం చక్కని, ఇరవై సంవత్సరాల యువకుడు వచ్చి, పార్వతికి దగ్గరగా నిలబడి నమస్కరించి—"అమ్మా! నేను మీ పెద్ద అబ్బాయిని." అని అన్నాడు.

పార్వతి ముసుగులోనుంచే చూసింది, మాట్లాడలేదు. ఆ కుర్రవాడు మరల నమస్కరించి —"అమ్మా, నేను మీ పెద్దబ్బాయిని—నమస్కరించటానికి వచ్చాను" అన్నాడు.

పార్వతి ముఖాన ముసుగు పైకి లాక్కుని—"రానాయనా, కూర్చో!" అని ఈమాటు మృదుస్వరంతో అన్నది. కుర్రవాని పేరు మహేంద్రుడు. అతను కొంచెంసేపు పార్వతి ముఖం వంక స్తబ్ధుడై చూస్తూ ఉండిపోయాడు. తర్వాత దగ్గరగా కూర్చుని, వినీతస్వరంతో చెప్పనారంభించాడు:

"ఇప్పటికి రెండు సంవత్సరాలైంది, మా తల్లి చనిపోయి. ఈ రెండు సంవత్సరాలూ ఎంత కష్టంతోనూ, దుఃఖంతోనూ గడిపామో చెప్ప శక్యం కాదు. ఇవ్వాళ మీరు వచ్చారు. ఇకనన్నా మేము సుఖపడేటట్టు ఆశీర్వదించు తల్లీ!"

పార్వతి చాల సహజస్వరంతో మాట్లాడింది. ఒక్కమాటే గృహిణి అయి, అనేక సంగతులు తెలుసుకోవలసి మాట్లాడవలసి వచ్చినప్పుడు మాట్లాడక ఏమి చేస్తుంది? కాని చాలా మందికి ఇది అస్వాభావికంగా కనపడవచ్చు. పార్వతిని బాగా ఎరిగినవారు మాత్రం, అవస్థా భేదాల వల్ల పార్వతి ఈడుకు మించి పరిపక్వ మైందని తెలుసుకుంటారు. ఇంతేకాక, అనవసరంగా సిగ్గుపడటం, అహేతుకంగా సంకోచపడటం, ఆమెకెప్పుడూ అలవాటు లేదు.

'నా మిగతా పిల్లలు ఎక్కడున్నారు, నాయనా?' అని అడిగింది.

మహేంద్రుడు కాస్త నవ్వి—'చెప్తాను—మీ పెద్దమ్మాయి—నా చెల్లెలు—అత్తగా రింటి దగ్గరనే ఉన్నది. నేను ఉత్తరంకూడా రాశాను—యశోద రావటానికి పడలేదు!' అన్నాడు.

పార్వతికి విచారం కలిగింది—"రాలేకపోయిందా? లేక రావటానికి ఇష్టం లేకనా!' అని అడిగింది.

మహేంద్రుడు సిగ్గుపడుతూ—'సరిగా తెలియదమ్మా!' అన్నాడు.

కాని అతని మాటలూ, ముఖభంగిమా పట్టి యశోద అలిగే రాలేదని పార్వతి గ్రహించింది.

'మరి చిన్నబ్బాయి?'

'వాడు త్వరలోనే వస్తాడు. కలకత్తాలో ఉన్నాడు—పరీక్షలు కాగానే వస్తాడు.'

* * *

భువన చౌదరి జమీందారీ పనులు స్వయంగానే చూస్తూ ఉండేవాడు. ఇంతే కాక సాలిగ్రామపూజా, సత్రంలో సాధు సన్యాసులకు పరిచర్యా తానే స్వయంగా చేస్తూ ఉండేవాడు. వ్రత ఉపవాసాలు కూడా ఉంటూ ఉండేవాడు. ఈ పనుల్లో అతనికి పది గంటలదాకా తెమిలేది కాదు. కొత్తగా వివాహం చేసుకున్న సంతోషం వారిలో ఏమి కనపడ లేదు. ఎప్పుడైనా ఒక రోజున అంతఃపురములోకి వచ్చేవాడు. లేక పోతే అదీ లేదు. వచ్చినా కూడా మామూలు సంభాషణే జరిగేది. పక్క మీద, బాలీసు తల క్రిందకు లాక్కుని, పండుకుని, కళ్లు మూసుకుని బిగ్గరగా—ఇప్పుడు "నీవే ఈ ఇంటి కంతా యజమాను రాలివి! కాస్త అంతా చూసి, చేసి సంసారం దిద్దు." అనేవాడు.

'అలాగే' అనేది పార్వతి తల తిప్పుతూ.

'ఇదిగో, ఈ పిల్లలంతా నీవాళ్లే—' అనేవాడు భువన బాబు. భర్త సిగ్గు పడటం చూసి పార్వతి పెదవుల మీద నవ్వు కంపించేది. భువనబాబు కొంచెం నవ్వు తెచ్చుకుని మరల అనేవాడు:

'ఆఁ—మహేంద్రుడు నీ పెద్దబ్బాయి. బి. ఏ. కూడా ప్యాసయినాడు—ఎంత మంచివాడు. —ఎంత దయా ధర్మాలు కలవాడు!—కాస్త ఆత్మీయతా కొంచెం ఆదరము చూపిస్తే—'

పార్వతి నవ్వును ఆపుకుని—'నాకు తెలుసు, వాడు మన పెద్ద అబ్బాయని' అనేది.

'అవును, ఎందుకు తెలియదు! అలాంటి వాణ్ణి ఎవ్వరూ చూసి ఉండరు. ఇక యశోద పిల్ల కాదు ప్రతిమ, తప్పకుండా వస్తుంది. ఎందుకు రాదు? ముసలి తండ్రిని చూడడానికి ఎందుకు రాదూ? వచ్చి నప్పుడు కాస్త గాన్ని—'

# [illegible] రాజకీయాలు

మదరాసు మంత్రులను అభినందించాలి— కలకత్తాలో విద్యార్థుల సమ్మె—దత్తు విడుదల—సంస్థాన ముస్లిం ప్రజలు, జిన్నా— ఊగులాడుతున్న అస్సాం మంత్రి వర్గం— పోలీసులలో తిరుగుబాటు బీజాలు— సంస్థానాధీశుల రాజభక్తి—

# ఊగులాడుతున్న అస్సాం మంత్రివర్గం

### మదరాసు మంత్రులను అభినందించాలి.

కాంగ్రెసు ఆజ్ఞలను శిరసా వహించుటకు దేశములో అనేకమంది ప్రభుత్వోద్యోగులు గత శాసనోల్లంఘనోద్యమంలో తమ పదవులకు రాజీనామాయిచ్చి గాని, పై ఉద్యోగస్థులచే డిస్మిసు చేయబడి గాని, అనేక కష్ట నష్టములకు గురి అయారు. ఆ కాంగ్రెసు సంస్థ తరపున ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధులు నేడు 7 రాష్ట్రాలలో పరిపాలనా యంత్రాన్ని చేబట్టారు. ఇట్టి రాజకీయ బాధితులకు, ఎవరి ఉద్యోగాలు వారి కిచ్చివేసి సహాయపడుట కాంగ్రెసు మంత్రుల కనీస కర్తవ్యం. మన రాజధానిలో ఇట్టి 106 గురు రాజకీయబాధితులకు వారి వారి ఉద్యోగాలను తిరిగి ఇచ్చివేసియు, 42 రి విషయంలో వారి పెన్షనుల కిచ్చియు, మదరాసు ప్రభుత్వం వారు తమ కర్తవ్యాన్ని నెరవేర్చారు. ప్రధాన మంత్రి రాజగోపాలాచారి గారి ఆంధ్రదేశ పర్యటనంలో, బందరులో ఆయన యిచ్చిన ఉపన్యాసం ఈ విషయంలో కొంత వ్యతిరేక భావాన్ని వెలిబుచ్చినప్పటికీ, ప్రజాందోళనను గుర్తించి, రాజకీయ బాధితుల విషయంలో తమ ధర్మాన్ని నిర్వర్తించినందుకు రాజాజీ మంత్రి వర్గాన్ని అభినందించక తప్పదు.

### కలకత్తా విద్యార్థుల సమ్మె.

కలకత్తా సెంట్ జేవియర్సు కళాశాలలో 2-9-38 తేదీని ప్రారంభమైన విద్యార్థుల సమ్మె 20-9-38 వ తేదీని ముగిసింది. క్రైస్తవ మత సంబంధమైన ఒక దినోత్సవ సందర్భంలో, కళాశాలాధికారుల అనుమతి లేనిదే విద్యార్థి ప్రతినిధులు తమ ఉపన్యాసాలను చదువకూడదని నిషేధించారు. కాని, విద్యార్థి ప్రతినిధులు దీన్ని ఉల్లంఘించారు. దానిలో, కళాశాలాధికారులు సుభాష్ చంద్రబోసు యొక్క అన్న కుమారులైన కళ్యాణ బోసు, అరవింద బోసు అనే యిద్దరు విద్యార్థులను తొలగించారు. వెంటనే బ్రహ్మాండమైన ఆందోళన బయల్దేరింది. కళాశాల విద్యార్థులు సమ్మెను ప్రారంభించారు. సమ్మె రెండవ రోజున పోలీసులు విద్యార్థులపై లాఠీచార్జి చేసి, 17 గురిని అరస్టు చేశారు. 5-9-38 వ తేదీని కలకత్తాలోని అన్ని కళాశాలలలోను సమ్మె ప్రారంభమైంది. మొత్తం 15,000 మంది విద్యార్థులు కాలేజీలు మానివేశారు. దీనితో విశ్వవిద్యాలయాధికార్లకు గాభరా పుట్టింది. సమ్మె కమిటీలతో రాయబారాలు నడుపుటకు సిండికేట్ సభవారు శ్యాంప్రసాద్ ముఖర్జీ, జస్టిస్ విశ్వాస్ అనే యిద్దరిని నియమించారు. కాని బోసు సోదరు లిద్దరినీ కళాశాలలో తిరిగి చేర్చుకొనం అని కళాశాలాధికార్లు మొదటినుంచీ పట్టుదల వహించినందువల్ల రాజీ సంభాషణలు సఫలం కాలేదు. తుదకు సమ్మె కమిటీ సమావేశమై, అన్ని విషయాలూ సమగ్రంగా చర్చించి, ఒక తీర్మానానికి వచ్చింది. బోసు సోదరులు కాలేజీని విడిచిపెట్టుటను, వారితోబాటు, కళాశాలాధికార్లకు అసంతృప్తిని తెలుపు జేస్తూ, మరికొంతమంది విద్యార్థి నాయకులు వెళ్ళిపోవుటకూ నిశ్చయించుకొని, సమ్మెను విరమించారు. కాని, డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్ఫర్మేషన్ కళాశాలలన్నిటికీ ఒక సర్క్యులర్ పంపించాడు. దాని ప్రకారం, ఊరేగింపులలోను, ప్రదర్శనాలలోను పాల్గొనే విద్యార్థులను విద్యాలయాధికార్లు పంపివేయవచ్చును. ఈ సర్క్యులర్ యెడల విద్యార్థిలోకంలో మిక్కిలి అసంతృప్తి వ్యాపించింది. 20 వ తేదీని బెంగాల్ రాష్ట్ర మంతటా విద్యార్థులు సమ్మె చేసి, సర్క్యులర్‌ను ఖండిస్తూ తీర్మానాలు ప్యాస్ చేశారు.

దేశంలో, ముఖ్యంగా బెంగాల్‌లోను, తిరువాన్కూరు సంస్థానంలోను, విద్యార్థులలో రాజకీయ చైతన్యం నానాటికీ వృద్ధిచెందుతోంది. స్వాతంత్ర్య పోరాటంలో విద్యార్థులు ప్రధాన పాత్ర వహించ గలరని స్పష్టం అవుతోంది. విద్యార్థులకూ—రాజకీయాలకూ సంబంధం లేదని చెప్పే వారి వాదన నిరాధారమవుతోంది.

### దత్తు విడుదల.

లాహోరు కుట్ర కేసులో పంజాబ్ ప్రభుత్వంచే యావజ్జీవ ద్వీపాంతర వాస శిక్ష విధింపబడిన శ్రీ భుక్తేశ్వర దత్తుగారు 6 సంవత్సరముల కఠిన శిక్ష ననుభవించి, క్షయ మొదలయిన వ్యాధులచే బాధపడి, చివరకు, బీహార్ కాంగ్రెసు మంత్రి వర్గం వారి శిఫార్సువల్ల పాట్నా జైలు నుండి విడుదల అయారు. కాని, బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలో అడుగు పెట్టకూడదని ఆ ప్రభుత్వాలు వెంటనే ఉత్వరువు లిచ్చారు. విడుదలకాగానే స్వాతంత్ర్య పోరాటాన్ని గురించి దత్తుగారీ క్రింది విధంగా చెప్పారు :

"నేడు అన్నిటికంటె ముఖ్యంగా భారతీయులు చేయవలసినదేమంటే, సామ్రాజ్య వ్యతిరేకులైన జాతీయవాదులంతా కాంగ్రెసు జండా క్రింద ఏకమై, ఐక్య సంఘటన పొందాలి. బ్రిటిష్ సామ్రాజ్య వాదులు మన దేశాన్ని యింకా బానిస స్థితికి తెచ్చుటకు అనేక పద్ధతులు అవలంబిస్తున్నారు. కేంద్ర శాసన సభలో యీ మధ్య ప్యాసైన సైనిక బిల్లువల్ల భారత స్వాతంత్ర్య వీరుల నోళ్లు బిగించ బడ్డాయి. సామ్రాజ్య వాదుల యీ దాడిని యెదుర్కోవాలంటే, స్వాతంత్ర్య పోరాటాన్ని వృద్ధి చేయాలంటే, జాతీయైక్య సంఘటన అవసరం. విప్లవం వర్ధిల్లు గాక!"

### సంస్థాన ముస్లిం ప్రజలు—జిన్నా.

భోపాల్ సంస్థాన ప్రజలు ముస్లింలీగ్ నాయకులైన జిన్నాను తమ సంస్థానానికి రమ్మని ఆహ్వానిస్తే, జిన్నా సమాధాన మిస్తూ, అఖిల భారత ముస్లింలీగ్ యొక్క శాఖలు ఒక్క బ్రిటిషు ఇండియాలోనే స్థాపింపబడి పని చేయాలని లీగ్ నిబంధనావళిలో ఉన్నది కాబట్టి స్వదేశ సంస్థానాలలో లీగ్ ప్రచారం చేయుటకు వీల్లేదని వ్రాశాడు.

జిన్నా నోటినుండి వచ్చిన యీ మాటలు ఏ సామ్రాజ్య వ్యతిరేకికీ ఆశ్చర్యం కలుగజేయవు. కొన్ని వందలమైళ్ల దూరంలో ఉండే పాలస్తయిన్ దేశంలో బ్రిటిష్ నిరంకుశత్వమునకు ఆహుతి అగుతూన్న ముస్లిం ప్రజల యెడల సానుభూతిని ప్రకటిస్తూ, చేరువలోనే, దేశీయులయిన ముస్లిం ప్రజలు సంస్థానాధీశుల రాక్షస పరిపాలనకు గురి అవుతోంటే వారికి సలహా కూడా యిచ్చుటకు జిన్నా యిష్టపడలేదు. దీనిలో ఉండే రహస్యాన్ని గ్రహించుటకు ఎంతో మేధాశం ఆలోచించనవసరంలేదు. కాశ్మీర్, భోపాల్ మొదలైన సంస్థానాలలో అధిక సంఖ్యాకులుగా ఉన్న ముస్లిం ప్రజలు బాధ్యతాయుత పరిపాలన కొరకు ఆందోళన ప్రారంభించారు. సామ్రాజ్య వాదుల కిది యేమాత్రం యిష్టం లేదు. వారి అడుగులకు మడుగులొత్తే జిన్నావంటి ముస్లిం లీగ్ నాయకులకు ఇది యిష్టంఉండదు. అంతే కాదు. హైదరాబాద్ సంస్థానంలో, సంస్థాన ప్రజల పౌరసత్వపు హక్కులకు అనేక విధాలుగా ఆటంకములు కల్పిస్తూ, కాంగ్రెస్ సంస్థను నిషేధించిన హైదరాబాద్ నవాబు యొక్క నిరంకుశ పరిపాలనా పద్ధతిని జిన్నా ఖండించాలి. ఇస్లాం మతానికి విరుద్ధంగా ప్రవర్తిస్తూన్న సంస్థానాధీశ్వరుని వైఖరిని గర్హించాలి! బ్రిటిష్ ఇండియాలో హిందువులపై మహమ్మదీయులకు మత ద్వేషం పురిగొల్పి, జాతీయైక్యతలో చీలికలు తెచ్చి, బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు లాభం వచ్చే ఉపాయాలు ఎల్లప్పుడూ ఆలోచించే జిన్నా ప్రభృతులు యీపనిమాత్రం చేయరు. మైసూరు సంస్థానంలో బయలుదేరిన ముస్లిం లీగ్ శాఖ బాధ్యతాయుత పరిపాలన అవసరం లేదని స్టేట్ కాంగ్రెసుకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తూంటే, జిన్నా రూల్సు ప్రకారం ఆ శాఖపై డిసిప్లినరీ చర్య తీసుకొని యుండాల్సింది. కాని, ఆయన ఆ విధంగా చేస్తాడా?

### ఊగులాడుతున్న అస్సాం మంత్రి వర్గం.

అస్సాం రాష్ట్రంలో అయిదుగురితో కూడిన మిశ్రమ మంత్రివర్గం ఏర్పడింది. ప్రధాన మంత్రి ఒక్కడే కాంగ్రెసు పార్టీ వాడు. ఆలీ హైదరుఖాన్ అనే అరవ మంత్రిని కూడా చేర్చుకున్నటు వార్తలు వస్తున్నాయి. 107 గురు గల అస్సాం శాసన సభలో 32 రు మాత్రమే కాంగ్రెస్ పార్టీకి చెందిన వారు. మిగిలిన 22 రు ఇండియా రాజ్యాంగ చట్టాన్ని భగ్నం చేదాం అనే అభిప్రాయంతోగాని, సాదుల్లా యొక్కయు, అతని స్నేహితులైన యూరపియన్, ముస్లిం లీగ్ సభ్యుల యొక్కయు జాతీయ విద్రోహ కార్య క్రమాన్ని మంటగలుపుటకుగాని కాంగ్రెసుతో చేరలేదు. మంత్రి వర్గంలో స్థానం సంపాదించేటందుకే కాంగ్రెసుకు సహాయం చేశారు. కాంగ్రెసు యందున్న హేమా హేమీ లంతా యీ మిశ్రమ మంత్రి వర్గాన్ని ఆశీర్వదిస్తున్నారు. కాంగ్రెసుకు మెజారిటీ లేని శాసన సభలలో కాంగ్రెసు సభ్యులు మంత్రి పదవులు తీసుకొంటే డిసిప్లినరీ చర్య తీసుకొనబడుతుందని 15-3-1937 మొదలు 22-3-37 వరకు ఢిల్లీలో జరిగిన వర్కింగ్ కమిటీ సమావేశంలో ప్యాసైన తీర్మానం వీరిలో ఒక్కరికీ జ్ఞాపకం లేదు కాబోలు!

యూరపియన్ సభ్యులు, ముస్లింలీగ్ సభ్యులు, హిందూ మహా సభ సభ్యులు యీ మిశ్రమ మంత్రి వర్గంలో ఎంత గట్టి తనం ఉన్నదో తెలుసు కున్నారు. కొత్త మంత్రి వర్గం యేర్పడిన మర్నాడే ప్రతికూల పక్షముల వారంతా ఒక చోట సమావేశమై, ఐకమత్యంతో కొత్త మంత్రి వర్గాన్ని ఓడించుటకు నిశ్చయించు కున్నారు. 56 గురు సభ్యులు సంతకాలు చేసి, విశ్వాస రాహిత్య తీర్మానానికి నోటీసు యిచ్చారు. ప్రత్యేక ముఠాలన్నీ యిప్పుడు ఒక్కటై, "యునైటెడ్ అస్సాం పార్టీ" అనే కొత్త పార్టీని కూడా స్థాపించారు.

107 గురు సభ్యులు గల ఎసంబ్లీలో 56 గురు విశ్వాస రాహిత్య తీర్మానానికి నోటీస్ యిచ్చారంటే, మిశ్రమ మంత్రి వర్గం ఎట్టి క్లిష్ట స్థితిలో యిరుక్కుపోయిందో ఊహించ వచ్చు. ఇప్పుడు అస్సాం మంత్రి వర్గానికి రెండే రెండు మార్గాలున్నాయి. రాజీనామానైనా యివ్వాలి, లేక, కాంగ్రెసేతర ముఠాలలో మరి కొంత మందికి మంత్రి పదవుల ఆశ చూపెట్టి తమ వైపుకు ఆకర్షించుకోనైనా ఆకర్షించాలి. ఈ రెండు జరక్కపోతే, ఓటమి తప్పదు. విశ్వాస రాహిత్య తీర్మానమే ఒక వేళ ఓడిపోయినప్పటికీ, కాంగ్రెసు కార్యక్రమాన్ని అమలు పరచాలంటే, మాటి మాటికీ అడ్డంకులు తప్పవు.

### పోలీసులలో తిరుగుబాటు బీజాలు.

నేడు భారత దేశంలో కాంగ్రెసు ప్రభుత్వాలు ప్రజా హక్కులకు దోహద మిచ్చేటందుకు ప్రయత్నిస్తున్నాయి. ఇదివరలో, జాతీయ ప్రతికూల మంత్రి వర్గాలు, కార్యనిర్వాహక శాఖలు అధికారంలో ఉండే కాలంలో ప్రభుత్వోద్యోగులు తమ యిష్టం వచ్చినట్టు ఆటలాడి, ప్రజలను దారుణంగా పీడించుట కలవాటు పడ్డారు. ఇప్పుడు ప్రజామోదాన్ని పొందిన కాంగ్రెసు మంత్రివర్గాలే అధికారానికి వచ్చిన తరువాత ప్రజలలో రాజకీయ చైతన్యం నానాటికీ ఎక్కువౌతోంటే, ప్రభుత్వాధికారుల పూర్వపు ఆటలు సాగడం లేదు.

ఇతర రాష్ట్రాలకంటె యు.పి. లో చైతన్యం తీవ్రత చెందింది. అనేక అత్యాచారాలకు అలవాటు పడిన ప్రభుత్వోద్యోగులకు, ముఖ్యంగా పోలీసు శాఖ వారికి, ప్రజా ప్రభుత్వం కంటకంగా కనబడింది. కొందరు పోలీసు ఉద్యోగస్థులు అనేక నేరాలకు విచారణ చేయబడుతూన్నందున అసంతృప్తి మరీ యెక్కువైంది. కాన్పూరు జిల్లా నాన్ గెజెటెడ్ ఆఫీసర్ల సంఘం సెప్టెంబరు 4 వ తేదీని సమావేశమై, కాంగ్రెసు ప్రభుత్వం పోలీసుల యెడల చూపుతూన్న "కఠిన వైఖరి"ని ఖండించింది. తమ అసంతృప్తిని ప్రకటించేటందుకు సెప్టెంబరు 17 వ తేదీని పోలీసు శాఖవా రందరూ ఉపవాసం చేయవలసినదని హెచ్చరిస్తూ, సంఘ కార్యదర్శి ఒక సర్క్యులర్ కూడా పంపాడు. అనేక కరపత్రాలు పోలీసుల గోడలమీద అంటించబడి ఉన్నాయి. ప్రభుత్వపు ఆర్డర్లు జారీ చేయబడిన కవర్లలోనే యివి కూడా పంపబడ్డాయి. 17 వ తేదీని చాలామంది ఉపవాసం చేశారు.

ఈవిధమైన తిరుగుబాటు బీజాలను నాశనం చేసి, నిరంకుశ పరిపాలనా యంత్రం యొక్క కుతంత్రాలను అరికట్టుటకు కాంగ్రెసు కమిటీలు తీవ్రంగా కృషి చేయాలి. లేకపోతే, కాంగ్రెసువారు మంత్రులయిన ప్రయోజనం ఉండదు.

### సత్యమూర్తికి ఫెడరేషన్‌పై గల మోజు.

సిమ్లాలోని మద్రాసు క్లబ్బులో సత్యమూర్తిగారు ఉపన్యసిస్తూ, యీ విధంగా పలికారు :

"ఫెడరేషన్‌లో లోపాలున్నప్పటికీ, దాని మెరుగులు (Charms) దాని కున్నాయి. ఫెడరేషన్ ద్వారా ఇండియా అంతా ఒకటౌతుంది....మదరాసు ప్రభుత్వానికి క్లిష్ట పరిస్థితులేవీ రాలేదు. అల్ప సంఖ్యాకులుగాని, ఉన్నతోద్యోగులుగాని గవర్నమెంటు యొక్క ప్రత్యేకాధికారాలపై పోలేదు."

"మెరిసే ప్రతి వస్తువు బంగారం కాదు. (All that glittery is not gold) అని ఆనాడు షేక్స్పియర్ మహా కవి అన్నాడు. అదే విధంగా, ఫెడరేషన్‌లో పైకి కనపడే తళుకులు చూచి సత్యమూర్తిగారు మురిసి పోతున్నాడు. బ్రిటిషు రాజనీతి వేత్తల ఉచ్చులలో పడు తున్నాడు. ఫెడరేషన్ వస్తే, దాన్ని మనం అంగీకరిస్తే, భారత దేశం అంతా తుత్తునియలై పోతుంది, ఇప్పుడున్న ఐకమత్యం కూడా ధ్వంసమవుతుంది. కొంచెమైనా అభివృద్ధి దశలో ఉన్న బ్రిటిషు ఇండియాకును, ఫేసిస్టు లక్షణాలు అమల్లో ఉన్న స్వదేశ సంస్థానాలకును మధ్య అన్యోన్య స్పర్ధలు యెక్కువౌతాయి. ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా హిందువులకును, మహమ్మదీయులకు సిక్కులకు మొదలైన వారిలో మత కక్షలు వృద్ధి చెందుతాయి. సత్యమూర్తిగారు మురిసి పోయే "ఐక్యత" ఎలుకను తిన్న పిల్లికి ఉండే ఐక్యతేగాని మరొకటి గాదు.

ఒక వైపు కేంద్ర శాసన సభలో సైనిక బిల్లుపై సింహ గర్జనలుచేసి సత్యమూర్తి మరొక వైపున, ఆ బ్రిటిషు ప్రభుత్వం చేతనే అమలు పరుపబడనున్న ఫెడరేషన్ విషయంలో యింత కిందికి దిగి జారిపోయాడెందుకా? అని ఆశ్చర్యం కలుగుతుంది. ఢిల్లీలో అ. భా. కాంగ్రెసు కమిటీవారు సమావేశమై, ఫెడరేషన్ పట్ల తమ ప్రతికూల వైఖరిని ఖచ్చితంగా ప్రకటిస్తోంటే, బరోడా దివాన్ యొక్క ఆధిపత్యాన్ని జరిగిన సభలో ఫెడరేషన్‌ను గురించి సత్యమూర్తి యిచ్చిన యీ అభిప్రాయం కాంగ్రెసు తీర్మానానికి పూర్తిగా వ్యతిరేకం. ఈ వైఖరి యెంత మాత్రం క్షంతవ్యం కాదు.

ఇక మదరాసు రాష్ట్రం విషయంలో, ఇతర రాష్ట్రాలంత తీవ్రంగా నిరంకుశ పాలనా యంత్రాన్ని యెదుర్కొనుటకు ప్రయత్నించక పోవడం, పైగా పోలీసుల లంచగొండి తనాన్ని బాహాటంగా, ప్రజల మధ్య సమర్థించడం—యివే రాష్ట్రంలో క్లిష్ట పరిస్థితులు లేకపోవడానికి కారణం. ఇది అంత గర్వించ వలసిన విషయం మాత్రం కాదు.

### యు. పి. లో కాంగ్రెస్ సైనికదళం.

యు. పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీ యాజమాన్యాన సుమారు 50,000 మంది వాలంటీర్లతో కూడిన కాంగ్రెసు సైనిక దళం యేర్పరుపబడింది. ఈ సంవత్సరం లోగా 1 లక్షమంది దళం తయారౌతుందని అంచనా వేయబడింది. ఈ దళం యొక్క ఉద్దేశ్యం, రాష్ట్రంలోఉన్న వివిధ కాంగ్రెసు కమిటీలకు మంత్రులు సహాయంచేయడమే. డ్రిల్లు, గుర్రపుస్వారి, ఆటలు, రాజనీతి శాస్త్రం, ఆర్థిక శాస్త్రం, సోషలిజం, ఫేసిజం మొదలైన విషయాలలో వీరికి తరిఫీదు యిస్తారు.

ఇట్టి ఆశయాలతోనే పది సంవత్సరాల క్రితం హిందూస్థానీ సేవాదళం స్థాపించబడింది. శాసనోల్లంఘనోద్యమంలో యీ దళం ప్రభుత్వంచే నిషేధింపబడింది. ఇప్పుడు కొన్ని కాంగ్రెసు రాష్ట్రాలలో యీ నిషేధం తొలగింది. మదరాసు మొదలయిన యితర రాష్ట్రాలలో యింకా తొలగ లేదు. బెంగాల్, పంజాబ్ వంటి కాంగ్రెసేతర రాష్ట్రాలలో సరే సరి! ఇట్టి పరిస్థితుల్లో, యు. పి. రాష్ట్ర కాంగ్రెస్ కమిటీవారు ప్రత్యేకంగా ఒక కాంగ్రెస్ సైనిక దళాన్ని యేర్పరచుట ప్రశంసనీయము. మహాత్ముని శాంతి సైనికదళం తన ఉన్నతాదర్శాలను అచరణలో పెట్ట గలుగునో, లేదో చెప్పజాలము గాని, యు. పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీ వారి యీ కృషి స్వాతంత్ర పోరాటంలో ప్రధానమైన స్థానం అలంకరించగలదు.

### సంస్థానాధీశుల రాజభక్తి.

ఐరోపాలో యుద్ధ జ్వాలలు నాలుగు వైపులా వ్యాపించడం చూచి, గ్రేట్ బ్రిటన్ కూడా యుద్ధంలో పాల్గొనక తప్పదని ముందే ఆలోచించి, రాజభక్తికి పేరెన్నిక గన్న భారత సంస్థానాధీశులు వైస్రాయికి టెలిగ్రాములు మీద టెలిగ్రాములు పంపించారు. బికనీర్, గ్వాలియర్, జోధపూర్, ప్రతాపఘర్, పాటియాలా, బెనారస్, మొదలైన సంస్థానాధీశులు, ప్రపంచ యుద్ధం చేస్తే తామూ—తమ సంస్థానాలు బ్రిటన్‌కు సహాయం వస్తామని ఆ టెలిగ్రాములలో వాగ్దానం చేశారు.

ఒకవైపు, కాంగ్రెసు సంస్థ 36 కోట్ల భారతీయుల ప్రతినిధిగా స్వాతంత్ర్య పోరాటాన్ని నడుపుతోంటే, మరొక ప్రక్క సంస్థానాధీశ్వరులు తమ అధికారంలో ఉన్న 8 కోట్ల మంది ప్రజల ప్రాణాలను బ్రిటిష్ వారి ముందు బలి యిచ్చుటకు సిద్ధంగా ఉన్నారు.

సంస్థాన ప్రజల సమస్య యెడల కాంగ్రెసు తటస్థ విధానం అవలంబించడం వల్ల యీ సంస్థానాధీశులు తమ ప్రజలను సామ్రాజ్య తృష్ణకు ఆహుతి చేయడమే గాకుండా వారి సామాన్య పౌరస్వపు హక్కులను పైశాచిక పద్ధతులతో అరికట్టుతున్నారు. ఇప్పటికైనా ఈ తటస్థ విధానాన్ని కాంగ్రెసు నాయకులు విడిచిపెట్టి, సంస్థాన ప్రజల స్వాతంత్ర్య పోరాటానికి సాయపడాలి.

కార్మిక సమస్యలు

# సమ్మె హక్కును భగ్నపఱచే బొంబాయి బిల్లు

విమర్శనలకు ఖేరు, మున్షీగార్ల సమాధానములు—మోటారు బండ్ల బిల్లు—చిట్టివలస లాకౌట్.

## బొంబాయి కార్మిక తగాదా బిల్లుపై చర్చ.

కార్మిక తగాదా బిల్లుపై, బొంబాయి శాసన సభలో సామాన్య చర్చ 9 రోజులు జరిగింది. ఈ చర్చ జరుగు చున్నప్పుడు అనేకులు మాట్లాడిరి. కాంగ్రెసు పార్టీ వారు ఈ బిల్లును బలపరుస్తూ మాట్లాడిరి. కార్మిక నాయకులు కొందరు, కాంగ్రెసు వ్యతిరేక పక్షీయులు మరి కొందరు ఈ బిల్లును వ్యతిరేకిస్తూ మాట్లాడిరి.

జమ్నదాస్ మెహతాగారు ఈ బిల్లును వ్యతిరేకిస్తూ యిది కార్మికుల సమ్మె హక్కును హరిస్తోందనియు ప్రభుత్వము ఈ బిల్లు ద్వారా కార్మిక వర్గానికి తీరని అన్యాయమును గావించుచున్నదనియు నుడివిరి. అంతర్జాతీయ కార్మిక మహా సభ (జినీవా)కు భారత దేశము నుండి ప్రతినిధిగా పోయిన యస్. వి. పరులేకరుగారు ఈ బిల్లును వ్యతిరేకిస్తూ యిది పైశాచిక సంబంధమైన బిల్లుగాని వేరొకటి గాదనిరి. ఇది కేవలం పెట్టుబడిదారుల లాభానికేననియు, దీని వలన జాతీయ పోరాటం సన్నగిలు ననియు, కార్మికులకు ఈషణ్మాత్రమైనను ప్రయోజనకారి గాదనియు నుడివిరి. "దీనిని బొంబాయిలో ఎందుకు చర్చలోనికి తీసుకురాలేము? కార్మికులు సమ్మెలు చేస్తారని భయమా? లేక కమ్యూనిస్టులకు జడిసియా? కమ్యూనిస్టులన్నచో అంత భయమే వుంటే యీ బిల్లు చర్చింపబడే టప్పుడు మీరు వారిని ఖైదులో నుంచి చర్చలు సాగింపరాదా?" అని సవాలు చేసిరి.

వీరు గాక అంబేద్కరు మొదలగువారు కూడా ఈ బిల్లును విమర్శించిరి.

వీటికి సమాధాన మిచ్చుచు శ్రీ కె. యం. మున్షీగారిట్లు చెప్పిరి "బ్రిటిష్ ప్రభుత్వముతో పోరాటం సాగించడమంటే పరిశ్రమలను నాశనం చేయుట గాదు. ఈ బిల్లు కార్మికుల సమ్మె హక్కును నాశనం చేయుట లేదు. అసలు సమస్యను కప్పిపుచ్చే ఆందోళనను అపుచేయుటయే యిందలి ప్రధానోద్దేశ్యము. ఈబిల్లు కేవలం కార్మికుల లాభం కొరకే తేబడింది. కార్మికులను రాజకీయ పక్షాలు తమ స్వలాభంకొరకు వినియోగించుకొనుటకు వీలు లేకుండా కేవలం ఆర్థిక సమస్యకే వారిని కట్టిపెట్టుటకొరకు యీ బిల్లు ఏర్పాటు చేయబడినది" అని పలికిరి.

"బ్రిటిష్ ప్రభుత్వముతో పోరాటమంటే పరిశ్రమలు పాడుచేసుకోడం కాదు" అని మున్షీగారన్నారు. అసలు ఏమీ నష్టం లేకుండా ప్రభుత్వంతో జరుగవలసిన పోరాట మెట్లు? కేవలము శాసనసభా పోరాటమేనా లేక ప్రత్యక్ష పోరాటము కూడానా? శాసనసభలలోనేజరిగే పోరాటానికి కూడా మెనుక చాలినంత ప్రజాందోళనసమీకరణ కులేందు చిన్న చిన్న విషయాలనుకూడా మన మంత్రులు చేయలేకుండా వుండుట మనం కళ్ళారా చూస్తున్నాము. ఈ ప్రజాందోళన సాగాలంటే ఎవరి పనిని వారు కట్టిపెట్టి ఒక్కొక్క ప్రత్యేక విషయానికై అందరూ కలిసి చేయవలెను గదా? ఈ సందర్భంలో కార్మికులు పాల్గొన్నప్పుడు వారు కూడా పనులు మాని ఆందోళనలో చేరాలా అక్కరలేదా?

ఇది గాక, ప్రత్యక్ష పోరాటంలో హర్తాళులు, ఊరేగింపులు, శాసనోల్లంఘనం, మొదలగు అనేక కార్యక్రమాలుంటాయి. ఇందు కార్మికులు పాల్గొనవలె నన్న వారు తమ తమ పనులు మాని రావలసి యుంటుంది. ఈ సందర్భంలో కూడా నిజంగా ప్రజలందరూ పాల్గొని ప్రభుత్వంతో పోరాడవలెనని మున్షీ గారు కోరుచో, ఆ యా ప్రజలు పనిచేసే పరిశ్రమలకు నష్టం రాక తప్పదు. దానికి నష్టం రాకూడదంటే ప్రజలు రా వీలుండదు. ప్రజలు రాకపోతే పోరాటం నెగ్గదు. నిజంగా పర ప్రభుత్వాన్ని దేశములో లేకుండా చేయాలంటే ప్రజలు ఎన్నోనష్టాలు పడాలి. పరిశ్రమలకు నష్టం రాక మానదు. స్వరాజ్య స్థాపనకై ఎన్నైనా కష్టాలు, నష్టాలున్నాయని అప్పుడే మున్షీగారు మరచిపోయి వుండడం విచారకరం.



ఇటీవల బొంబాయిలో లాఠీ చార్జీకి గురియైన కార్మికులు

యిక రెండవ విషయం. "యీ బిల్లు సమ్మె హక్కును రద్దు పరచుటలేదు: ఆందోళనలతో, నినాదాలతో, సభలతో అసలు విషయాన్ని కప్పి పుచ్చకుండా నిరోధించేది" అన్నారు.

కార్మికులు తమ కొన్ని కోర్కెలకై సమ్మె చేసి వాటిని సంపాదించుకోవాలన్నా, వాటిని నిలుపుకోవాలన్నా ఆందోళన ముఖ్యావసరం. యీ ఆందోళన ద్వారా ప్రజాభిప్రాయాన్ని తమ ఇబ్బందుల వైపుకు మరల్చుకుంటారు. ఇక సమ్మెల విచారణలు జరుగుచున్నప్పుడు యజమానులు కూలీలను నిర్బంధిస్తే యిట్టి ఆందోళన ద్వారానే వారు తమ హక్కులను నిలుపుకో గలరు. నిజంగా యీ ఆందోళనను అపుచేయడం అంటే సమ్మె విజయానికి ప్రధాన ఆయువుపట్టును రద్దు చేయుటయే. నెగ్గవలెననే ఆశను, అవకాశాన్ని రద్దు చేసిన నాడు సమ్మె హక్కును కూడా రద్దు చేయుటయే. ఈపని యీబిల్లు చేయుచున్నది.

యీ బిల్లు, సమ్మెలను బలవంతముగా అపు చేయుటకును పాడుచేయుటకే వుపయోగించును గాని సరియగు నివారణను చేకూర్చలేదు. కార్మికుల సమ్మెలు, జయమందుటకు మార్గాలను బలపర్చాలి గాని, వాటిని పాడుచేయుటకు మార్గాలను, కాంగ్రెసు పార్టీ వారు ఏర్పాటు చేయుట అన్యాయము.

యిక మూడవది. "కార్మికులను రాజకీయ పక్షాలు తమ లాభాలకై వినియోగించుకొన కుండ జేయుటకు ఇది పనికివచ్చును" అని అన్నారు.

కార్మికులలో రాజకీయ చైతన్యం లేకుండా, వారు స్వరాజ్య పోరాటంలో పాల్గొనుట దుర్లభము. యీ రాజకీయ చైతన్యం ప్రబోధం ద్వారానూ, వారు దిన దిన సమస్యలను ఎదుర్కొనుటకు పడే బాధల ద్వారానూ వారిలో కలుగుతుంది—ఈ ప్రబోధాన్ని ఆపుటకు యీ బిల్లు వస్తే, కాంగ్రెసుకు కూడా కార్మికులు సహాయపడలేని దుర్భర రాజకీయ అంధకారంలో కార్మికులుందురు.

రాజకీయ దాస్యము నుండి పోయే వరకూ ఆర్థిక దాస్యము మన దేశీయులకు పోదని కదా మనం చెప్పుచున్నది. ఈ బిల్లు ద్వారా రాజకీయ చైతన్యాన్ని, తద్వారా రాజకీయ స్వాతంత్ర్యాన్ని మన కాంగ్రెసు వారు అపుచేయు చున్నారు. అంటే ఆర్థిక దాస్యాన్ని శాశ్వతంగా కార్మికుల నెత్తిపై రుద్దుటకు పూనుకొనటమే అగును గాని మరేమియు గాదు. ఈ విధమగు లోపములను గావించుచున్నచో మన స్వరాజ్య పోరాటములో ముఖ్య శక్తియగు కార్మిక వర్గాన్ని పోరాట రంగమునుండి వేరుచేయుదుము. ఇందువలన నష్టపడేది స్వరాజ్య పోరాటం. అందుచే మన మంత్రులిట్టి తెలివి తక్కువ పనులుచేయకుండా చూడవలసిన బాధ్యత మన అందరిపైననూ గలదు. ప్రజా ఆందోళన ద్వారానే ఇట్టి తప్పులనుండి మన మంత్రులను మనం ఉద్ధరించ గలుగుతాము.

ఈ బిల్లుపై సామాన్య చర్చ పూర్తి అయినపిదప క్లాజువారీ చర్చ ప్రారంభించుటకు ముందు ఈబిల్లుపై వివిధ కార్మిక సంఘాల అభిప్రాయాన్ని కనుగొనుటకు దీనిని సర్క్యులేటు చేయవలసినదని జమ్నదాస్ మెహతా గారు సూచించిరి. యీ సూచన ఓటుకు పెట్టగా ఓడిపోయినది. దీనిని సెలెక్టు కమిటీకి పంపవలసినదని కాజీ మెర్సన్ గారు ప్రతిపాదించిరి. ఆ సూచన కూడ ఓడిపోయినది.

ఈ బిల్లుపై కార్మికులు సావకాశముగా చర్చించుకొని తమ అభిప్రాయము నిచ్చుటకు చాలినంత అవకాశము నీయవలసినదని యస్. వి. పరులేకరు గారు ప్రభుత్వమును కోరిరి.



దీనికి ప్రధాని ఖేరు గారు సమాధాన మిచ్చారు. "ఈ బిల్లులోని మంచి చెడ్డలను అనుభవపూర్వకముగా కనుగొనిన తరువాత, కార్మిక సంఘాలు తమ ప్రతినిధుల ద్వారా దీనికి సవరణలను పంపవచ్చును. కార్మికులకు యీ బిల్లు ద్వారా జీతాలు హెచ్చించి ఎంతో మేలు చేస్తున్నాము." అనిరి.

ఫెడరేషను అమలు జరిగిన తరువాత, అందలి మంచి చెడ్డలను అనుభవ పూర్వకంగా తెలియ జెప్పినచో మార్చుటకు తమకేమీ అభ్యంతరం లేదని బ్రిటిష్ వారు చెప్పు చున్నారు. భారతీయులకు ఫెడరేషను ఎంతటి విషపు గుటికయో, కార్మికులకు యీ బిల్లు కూడా అంతటి విషపు గుటికయే. వీని లాభ నష్టాలను అనుభవ పూర్వకంగా చెప్ప నక్కరలేదు. వాటి స్వరూపమే వాటిని గూర్చి విపులంగా చెప్పు చున్నది. అందుచే ఖేరుగారి వాదనలో క్రొత్త ఏమీ లేదు. వెనుక మనం అందరమూ అలవాటు పడివున్న వాదననే ప్రయోగించిరి. ఖేరు గారు చెప్పినంత మాత్రమున యీ వాదన మంచిది కానేరదు.

తదుపరి యీ బిల్లుపై క్లాజు వారీ చర్చ ప్రారంభమయినది. మొదటి రోజున 2 క్లాజులున్ను 3వ క్లాజులో కొంత భాగమున్ను జరిగినవి. ఈ బిల్లును అతి తొందరలో పూర్తి చేద్దామని బొంబాయి ప్రభుత్వము తలంచు చున్నది. అందుకై ప్రతి దినమూ రాత్రులు కూడా రెండు గంటలు చర్చలు పొడిగించుటకు యోచించు చున్నారు.

## మోటారు బండ్ల బిల్లుపై చర్చ

కొద్ది రోజులనుండి కేంద్ర శాసనసభలో, మోటారు బండ్ల బిల్లును గూర్చి క్లాజువారీ చర్చ జరుగుచున్నది.

ఇందు మోటారు కార్మికుల విషయములు చర్చకు వచ్చినప్పుడు యన్. యం జోషి, రంగా గార్లు మొదలగు కార్మిక శ్రేయోభిలాషులే గాని ఇంకెవరును కార్మికులకు అనుకూలముగా మాట్లాడేవారే లేరు.

మోటారు పనివారు పని చేయవలసిన గంటలను గురించి చర్చ వచ్చినప్పుడు, పనిచేసే గంటలు రోజుకు 9 అని నిర్ణయింపబడింది.5 గంటల తరువాత ½గంట విశ్రాంతి ఏర్పాటు చేయబడింది. ఇవి జోషి గారి సవరణల ఫలితంగా ఏర్పడినవి.

ఈ నిర్ణయాలను వీలు వెంబడి మార్చుచు 54 గంటల వారమును, 48 గంటలకును, ½ గంట విశ్రాంతిని 1 గంటకును తగ్గించు అధికారము రాష్ట్ర ప్రభుత్వాలకు అధికారము నివ్వవలసిందని యన్. యం. జోషిగారింకొక సవరణను ప్రతిపాదించిరి. ఇది ఓటుకు వచ్చినప్పుడు, యూరపియను, ముస్లిం లీగు, కాంగ్రెసు నేషలిస్టులు యీ సవరణకు వ్యతిరేకంగా ఓటు చేసిరి. ఈపక్షాలు ఎప్పుడూకార్మికులకు హానినేచేస్తూ ఉన్నాయి. కాంగ్రెసు పార్టీ ఈ విషయంలో తటస్థంగా వూరుకున్నది. ఇందుచే సవరణ వీగిపోయింది. కాంగ్రెసువారి ఈ వైఖరి బుద్ధ తెలివి తక్కువది.వీరిట్టి వైఖరిని విడచి కార్మికులకు అనుకూలముగా వర్తించవలయును. లేకున్నచో మన ఎన్నికల ప్రణాళికలలో మన వాగ్దానాలను నిలుపుకొనుట కష్టం.

## మిల్లు యజమానుల మోసం
## చిట్టివలసలో లాకౌటు

చిట్టివలస మిల్లులోని బేచింగ్ డిపార్టుమెంటులో యస్. అప్పారావు అను కార్మికుడు పని చేసేవాడు. జనపనారను బండిలో వడికే మిల్లువద్దకు తీసుకుపోవుట ఇతని పని. ఇదివరలో యిందు ముగ్గురుండేవారు. తరువాత ఇద్దరయి, తరువాత వీరేసు ఒక్కడే మిగిలెను. ఇతనికి చేతిపై దెబ్బ తగులుటచే ఆ పని చేయలేక ఇంకొక పని యివ్వవలసినదని యజమానులను కోరెను. అక్కడి డాక్టరు పరీక్షచేసి అతనికి సర్టిఫికెట్టు ఇచ్చెను. అతనిని యింకొక పనిలోనికి మార్చిరి. ఇంకెవరునూ యితను చేయు పనిని చేయలేక పోవుటచే తిరిగి యితనినే బండి మోత పనికి పంపిరి, అతను నెత్తురుకూడ కక్కుకొనెను. పని చెయలేనని యజమానులతో మనవి చేసుకొనగా అసలు పనినుండియే అతనిని తొలగించిరి— యిదంతా 13 వ తేదీని జరిగింది.

14 వ తేదీని కళ్లా అప్పన్న అను కార్మికుడు (వడికే డిపార్టుమెంటులో పనిచేయు చున్నాడు) నార పెనవేయు చుండగా కొంత తాడు సన్నంగా వచ్చినది. ఆ ముక్కను త్రెంచి పారవేసి దానిని సరి దిద్దెను. ఈ సందర్భంలో ఒక మేస్త్రీ వచ్చి యాతనిపై కోపపడి జరిమానా వేసెను. దీనికి కారణ మడుగగా



బొంబాయిలో లాఠీదెబ్బలకు గురియైన కార్మిక యువక నాయకుడు టాంబెత్కర్

ఆ మేస్త్రీ మండిపడి ఆ కార్మికుడిని డిస్మిస్ చేసెను. అతనిని డిస్మిస్ చేయవద్దని కార్మికు లందరూ మేస్త్రీని వేడిరి. అతను వినకపోవుటచే కార్మికులందరూ కొంత సేపు పని మానివేసిరి. యిందువలన మిల్లులో పని ఆగి పోయినది—సాయంత్రం కార్మికులందరూ మళ్ళీ పనిలోనికి పోయినను యజమానులు మిల్లు తెరువక లాకౌట్‌ను ప్రారంభించిరి.

## ప్రెస్ వర్కర్ల కనీసపు కోర్కెలు
## తెనాలి.

1. 6 నెలలు అప్రెంటీస్ చేసిన తరువాత నెలకు కనీసము 10 రూపాయల జీతము ఉండాలి. ఒక సంవత్సరం అయిన తరువాత 15 రూపాయలు జీతము చేయాలి. ప్రస్తుతము 15 రూపాయల జీతమున్నవారికి 2 రూపాయిలు ఎక్కువ చేయాలి.

2. రోజుకు ఎనిమిది గంటలకు పని మించరాదు.

3. ప్రెస్ వర్కర్ల యూనియన్‌ను యజమానులు వెంటనే గుర్తించాలి.

4. సంవత్సరమునకు 15 రోజులు [illegible] జీతముతో సెలవుండాలి.

5. ప్రతి నెల 7 వ తేదీ లోపుగా జీతాలివ్వాలి.

ఈ కోర్కెలు తెనాలిలో 18-9-38 వ తేదీని శ్రీ కొడాలి ఆంజనేయులు గారి అధ్యక్షతను జరిగిన ప్రెస్ వర్కర్సు కాన్ఫరెన్సులో ఆమోదింపబడినవి. ఈ మహా సభలో ఫెడరేషన్‌కు వ్యతిరేకంగాను, కార్మికులకు హెచ్చరికనిస్తూ కొన్ని, తీర్మానాలు చేయబడినవి—సభానంతరం పెద్ద ఊరేగింపు జరిగినది.

## బొంబాయి

బొంబాయి బ్రాడ్బరీ మిల్లులోని సమ్మె ఆగి పోయినది. యజమానులు మిల్లు తెరవగానే పని వారందరూ పనికి వెళ్లిరి.

## గవర్నమెంటు ప్రెస్ సమ్మె

1200 మంది పనివారు పనులను మానిరి.

మద్రాసు గవర్నమెంటు ప్రెస్‌లో మెషిన్ డిపార్టుమెంటులో సుమారు 200 మంది పనివారు నేటి ఉదయం నుండియు పని మాని వేసిరి.

సీనియర్ యిండియన్ పనివారుండగా వారి హక్కును పోగొట్టి, ఒక ఆంగ్లో ఇండియనును ఎక్కువ జీతముపై వేయుటచే యీ సమ్మె ప్రారంభమయినది.

ప్రెస్ యజమానులు పోలీసులను పిలిపించి, పని చేయని మిషను రూము పనివారందరూ డిస్మిసు చేయబడుదురని ప్రకటించి పనిలో చేరనివారని పనినుంచి తొలగించినట్లు ప్రకటించిరి. అందుపై ప్రెస్‌లో గల మొత్తం 1000 మంది పనివారూ బయటకు వచ్చి సమ్మెలో చేరిరి. సమ్మె శాంతముగా సాగుచున్నది.

# అదీ —ఇదీ —అన్నీ

ఆంధ్రరాష్ట్ర ప్రెస్ వర్కర్సు యూనియన్ కార్యనిర్వాహక వర్గ సమావేశము 18-9-38 ఆదివారము నాడు యేలూరు రైతు ఆఫీసు యందు సమావేశమై జంపని పేరయ్యగారి అధ్యక్షత క్రింద యీ తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింప బడినవి.

1. ఏలూరు ప్రెస్ యజమానులు ప్రింటర్సు అసోసియేషన్ స్థాపించుకొని ప్రెస్ వర్కర్సు యూనియనును గుర్తించక పోవుటయేగాక వర్కర్సు ప్రాథమిక హక్కులకు కూడ భంగము వాటిల్లునట్లు తీర్మానములు కావించుచూ ప్రెస్ వర్కర్సు యూనియనును విచ్ఛిన్నము చేయుటకు వర్కర్సును సంఘము నుండి రాజీనామా పెట్టవలెనని నిర్బంధము చేయుచున్నందులకు ప్రింటర్సు అసోసియేషన్ వారి చర్యలను ఖండించు చున్నాము. రాష్ట్ర మంతటను ప్రెస్ యజమానులు ప్రింటర్సు అసోసియేషన్ స్థాపించి పనివారల మీద దండయాత్ర తీవ్రముగా కొనసాగించుటకు యేలూరు ప్రింటర్సు అసోసియేషన్ వారు ప్రయత్నించు చున్నట్లు తెలియుచున్నది కనుక రాష్ట్రమంతట ప్రెస్ వర్కర్సు కడు జాగరూకులుగా నుండవలెనని కోరుచున్నాము.

2. ఏలూరు వెంకట్రామా ప్రెస్‌లో యూనియన్ అవసరములేదని యజమానులే పనివారి కొరకు సంఘము స్థాపించవలెనని యజమానులే మహజరును అచ్చు వేయించి దానిపై సంతకములు పెట్టని వారిని పనిలోనుండి తొలగించడము సదరు యజమానులు యూనియన్‌ను విచ్ఛిన్నము చేయుటకు సంతకములు పెట్టవలయునని పనివారలను నిర్బంధించినట్లు స్పష్టమగుచున్నది. అదేవిధముగా యేలూరులో పట్టాభిరామా, సీతారామాంజనేయ ప్రెస్‌ల ప్రొప్రయిటర్సు కూడ పనివారలను నిర్బంధము చేసి అట్టి మహజరుమీద సంతకములు చేయించిరి. ఇది పనివారల స్వాతంత్ర్యమును అరికట్టుచున్నది. కాంగ్రెసు విధానమునకు వ్యతిరేకము గనుక కార్మికశాఖా మంత్రి యగు వి. వి. గిరిగారిని ఈ విషయముపై వెంటనే జోక్యము కలుగ చేసుకొన వలెనని కోరుచున్నాము.

3. ప్రెస్ వర్కర్సు యూనియన్‌కు వ్యతిరేకముగా కొంతమంది పనివారలు తమ యజమానుల బెదరింపు మాటలకు లోబడి మోసపోయి ప్రెస్ వర్కర్సు యూనియన్ తమ యభివృద్ధికి తోడ్పడుటలేదని తాము ఆ సంఘములో సంబంధము వదలుకొంటిమని వ్రాసి యిచ్చినందులకు విచారించుచూ వ్యక్తిగతంగా తమ హక్కులకే భంగము కలుగునట్లు ప్రవర్తించుటయే గాక ప్రెస్ వర్కర్సు అందరి జీవనోపాధులకు మోసము వాటిల్లునట్లు వ్యవహరించు చున్నారు గనుక వారు యజమానులకు అచ్చు ప్రతులమీద సంతకము చేసి యిచ్చిన కాగితములు ఉపసంహరించు కొనవలెనని కోరుచున్నాము.

3. (బి) ఏలూరు ప్రెస్ వర్కర్సు యూనియన్ అధ్యక్షులు యూనియన్ తీర్మానమునకు వ్యతిరేకముగా ప్రవర్తించి యూనియన్‌కు వ్యతిరేకముగా తాను యజమానుల కాగితముల మీద సంతకము చేయుటయే గాక కొంతమంది పనివారలను అట్లు చేయుటకు ప్రోత్సహించడమువల్ల యూనియన్ అభివృద్ధికి నిరోధకముగా ప్రవర్తించిరని యభిప్రాయ పడుచూ యూనియన్‌లో బాధ్యతగల స్థానముల నుండి వారిని తొలగించవలెనని ఏలూరు యూనియన్ వారిని కోరుచున్నాము.

4. రాష్ట్ర ప్రెస్ వర్కర్సు మహాసభ యేలూరులో జరుపుటకే నిర్ణయించుచూ అక్టోబరు నెల ఆఖరు వరకు వాయిదా వేయుటకు తీర్మానించడమైనది. ప్రొఫెసర్ యన్. జి. రంగాగార్ని మహాసభకు ప్రత్యేకముగా ఆహ్వానించుటకు తీర్మానించడమైనది.

5. విజయనగరము నుండి వెలువడు చున్న కార్మిక పత్రికకు స్వాగత మొసగుచూ రాష్ట్రములోని కార్మిక సమస్యలకు అత్యధికమగు ప్రాముఖ్యత నిచ్చుచూ ఆంధ్ర దేశములోని కార్మికోద్యమ వ్యాప్తికి తోడ్పడునని యాశించు చున్నాము.

పిల్లలమర్రి వెంకటేశ్వర్లు,
ప్రధాన కార్యదర్శి
ఆంధ్రరాష్ట్ర ప్రెస్ వర్కర్సు యూనియన్

* * *

### నేషనల్ యూత్ ఒలింపిక్
### అక్టోబరు 25 ప్రారంభము.

కృష్ణా జిల్లా యువజన సంఘంవారి యాజమాన్యాన కృష్ణా జిల్లా రైతాంగ విద్యాలయావరణలో (గన్నవరం తాలూకా పొట్టిపాడు) అక్టోబరు 25 నుండి చెడుగుడి జట్టుకు ఆరుగురు, పరుగు వందగజాలు. రెండు ఫర్లాంగులు, అరమైలు, హర్డిల్సు వంద గజాలు, రిలేరేస్ జట్టుకి నలుగురు నాలుగు ఫర్లాంగులు, ఈత వాలు రెండు ఫర్లాంగులు, సైకిలు త్రొక్కుట స్పీడు నాలుగు మైళ్ళు, లాంగ్ జంపు, సమ్మె విసరుట, క్రికెట్‌బాలు విసరుటలలో పందెములు జరుగును. యీ క్రింద సూచింపబడ్డ విషయముల ఒక విషయం పైన వక్తృత్వ పోటీ పరీక్షయు, ఒక విషయం పైన వ్యాసరచనా పోటీ పరీక్షయు జరుగును.

1. భారత స్వాతంత్ర్య పోరాటంలో యువజనుల కర్తవ్యమేమి?

2. ఆంధ్రరాష్ట్ర ప్రాప్తికి అవసరమైన మార్గాలేమిటి?

3. యుద్ధం వస్తే మనదేశం ఏంచెయాలి?

4. వయోజన విద్య వ్యాపించటానికి మార్గాలేమిటి?

5. యువజనుల ఎడ కాంగ్రెసు కర్తవ్యమేమి?

పై పోటీ పందెములలో విజయము కాంచు వారికి ప్రథమ బహుమానములుగా వెండి పతకములును, ప్రసిద్ధ గ్రంథరాజములును, ద్వితీయ బహుమానములుగా వస్తువులు వగైరాలున్నూ యీయబడును. పందెముల సమయములలో కర్రసాము, కత్తి సాము ప్రదర్శించ బడును. దరఖాస్తు రుసుము చెడుగుడికి రూపాయి. మిగిలిన వాటికి నాలుగణాలు మాత్రమే. ఆటలలో పాల్గొనువారికి ఆయా ఆటలున్న రోజుల్లో భోజన ముచితము. లాడ్జింగు ఎప్పుడూ ఉచితమే. యీ ఆటలలో కృష్ణా జిల్లాలోని 14-30 సంవత్సరముల మధ్య వయస్సు గల యువకులే పాల్గొన వచ్చును. దరఖాస్తులు అక్టోబరు 15 వ తారీఖులోగా "కన్వీనరు, స్పోర్ట్సు కమిటీ, జమీ గొల్వేపల్లి (వయా పామర్రు) కృష్ణా" అను అడ్రెస్‌కు పంపవలెను. పై అడ్రెస్‌కి వ్రాసుకొన్న కావలసిన వివరములను కూడా బడయవచ్చును. యీ ఒలింపిక్ ప్రారంభమునకు, బహుమతుల నీయుటకు యువజన నాయకు లాహ్వానింప బడుదురు. పందెములలో జిల్లా యువజనులందరూ పాల్గొని ఒలింపిక్‌ను జయప్రదం కావించ వలసినదిగా ప్రార్థన.

ఇట్లు
రాజగోపాలరావు,
ప్రధాన కార్యదర్శి
కృష్ణా జిల్లా యువజన సంఘం.

* * *

### రామచంద్రపురం తాలూకా
### కాం॥ సో॥ పార్టీ సమావేశము.

16 సెప్టెంబరు మధ్యాహ్నం 1 గంటకు బసుగువాని లంకలో కామ్రేడ్ కొ॥ పట్టాభి రామయ్యగారి అధ్యక్షతను రామచంద్రపురం తాలూకా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సభ్యులు సమావేశమై, కామ్రేడ్ చింతల సత్యనారాయణ దాసుగారిని, కార్యదర్శిగాను, కామ్రేడ్ చాగంటి భీమశంకర శాస్త్రి, సూరుబొట్ల సూర్యనారాయణమూర్తి, శీరంశెట్టి అప్పలస్వామి సూర్యనారాయణమూర్తి గార్లను కార్య సంఘ సభ్యులుగాను యెన్నుకొని తాలూకా కాం॥ సో॥ పార్టీ యేర్పాటు చేయడ మయినది. తాలూకాలో నవంబరు నెలాఖరులోగా 5000 మంది రైతు సంఘ సభ్యులను 4000 మంది వ్యవసాయ కూలీ సంఘ సభ్యులను చేర్పుటకు 50 రైతు సంఘములు 25 వ్యవసాయ కూలీ సంఘములు స్థాపించుటకు, ఈ నెలాఖరులోగా 25 గురు నవశక్తి చందాదార్లను చేర్పుటకు తీర్మానించడ మైనది.

తాలూకా యువకులలో రాజకీయ విజ్ఞానమును అభివృద్ధి చేయుటకు, ఒక పఠన బృందమును స్థాపించుటకు యేర్పాటు చేయడమైనది. ఫెడరేషన్ ప్రతిఘటింప వలసినదిగాను యుద్ధ ప్రతికూల ప్రచారము సాగించమనియు హెచ్చరించు తీర్మానాలు చేయడమయినది. (ఒక విలేఖరి)

* * *

### కోవూరు తాలూకా కాంగ్రెసు సంఘం.

అక్టోబరు నెల 5 వ తేదీ బుధవారం మధ్యాహ్నం గం. 3 లకు కోవూరు తాలూకా కార్యనిర్వాహక వర్గ సమావేశమున్ను గం. 4 లకు సామాన్య సంఘ సమావేశమున్ను కొడవలూరు రైల్వే స్టేషను వద్ద సత్రములో జరుగును. ముఖ్య విషయములను గురించి చర్చింతురు గాన తాలూకా సభ్యులెల్లరును తప్పక దయచేయ గోరెదము. కాంగ్రెసు ప్రాథమిక సభ్యులను చేర్చిన ఫారాలు వెంటనే తాలూకా కార్యాలయమున యిచ్చి ఇంకను సభ్యులను చేర్పించుటకు ఎక్కువ శ్రద్ధబూని పనిచేయవలెను. సమావేశములకు సభ్యులు యావన్మంది తప్పక రాగోరెదము.

తిమ్మారెడ్డి రమణారెడ్డి.
అధ్యక్షులు.
మొల్లూరు వెంకటశేషయ్య,
కార్యదర్శి.

## చీరాల పనివారలు

(7 వ పేజీ తరువాయి)

నులు వారి ద్వారా సంఘాన్ని చెడగొట్టే తమ యొక్క ప్రయత్నాలను మరింత సులువుగా సాగించుకుంటూ ఉంటారు. ఈ విధంగా, బయటనున్న మనం కూడ, అవసరం వచ్చినపుడల్లా యూనియన్ యొక్క కార్యకలాపంలో పాల్గొంటూ యీ విషయంలో మూకీభావం వహించి ఊరుకున్నట్టయితే యజమానుల తంత్రాలకు సాయపడుతున్నట్టే. ఈ సంఘాన్ని కంపెనీ చేతుల్లోకి పోనిచ్చినా, సంఘంలో వారుండాలి. వీరుపోవాలి. అనే ఉద్దేశంతో సంఘంలో చీలికలుగ చేసి సంఘాన్ని బలహీన పరచినా ఆంధ్ర రాష్ట్ర కార్మికోద్యమానికే కాకుండా, కాంగ్రెసు ఉద్యమానికి కూడ ఎంతో దెబ్బ. కార్మిక, రైతు ఉద్యమాలు తీవ్రమవుతున్న కొద్దీ, స్వాతంత్ర ఉద్యమం కూడ తీవ్రమవుతూ ఉంటుంది. కార్మిక రైతు ఉద్యమాలు బలపడి తీవ్రం కావటం అంటే, సామ్రాజ్య వ్యతిరేక స్వరూపాన్ని పొందటం అంటే, వర్గ కలహ సూత్రం ద్వారానే సాధ్యమవుతుంది. గాంధి సేవా సంఘంవారి వర్గ సామరస్య సిద్ధాంతం వల్ల **(class collaboration)** ఉద్యమంలో, సంస్కరణ తత్వం, మితవాద తత్వం, ఎక్కువౌతుంది. ఈ వర్గ కలహ సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొనే చీరాల పొగాకు పనివారల సంఘాన్ని నిజమైన సామ్రాజ్య వ్యతిరేక సంఘంగా తయారు చేసి కాంగ్రెసు ఉద్యమానికి కార్మికోద్యమానికి మధ్య ఐకమత్యత, సన్నిహిత సంబంధం కలుగ చేయుటకు గుంటూరు జిల్లాలోని కాంగ్రెసు నాయకులు తోడ్పడాలని ఆశిస్తున్నాం. ప్రస్తుతం సంఘంలో, యేర్పడిన చీలికలను నిర్మూలించి సంఘాన్ని పునరుద్ధరించటంలో సోషలిస్టులకు కాంగ్రెసు నాయకులకు పూర్తి దోహద మివ్వాలి.

త్వరలో లేబరు కమిషనరైన శొంఠి రామమూర్తిగారు చీరాల కార్మికుల దుస్థితిని పునర్విచారణ చేయుటకుగాను రాబోతున్నారు. లోగడ జిల్లా కలెక్టరు జరిపిన విచారణప్పుడు యజమానులు పనిలో నుంచి తొలగిస్తామని బెదురు పెట్టి, సంఘానికి చెందిన కొంత మందిచేత తమ కనుకూలంగా సాక్ష్య మిప్పించుకున్నారు. ఈతడవ విచారణలో యజమానుల బెదిరింపులను, నిర్బంధాన్ని ధైర్యంగా యెదుర్కొని తమ సంఘం తరపున నిలబడి సంఘాని కనుకూలంగా సాక్ష్యమిచ్చుకునే హక్కును నిలబెట్టుకునేట్లు చేయవలసి యుంటుంది. సంఘ సభ్యులుకూడ యజమానుల తరపున సాక్ష్యం పల్కటంలో ఉన్న నష్టాన్ని గుర్తెరిగి సంఘం తరపునే నిలబడుటకు యెప్పుడును సంసిద్ధులుగా నుండాలి. హక్కులను విచారణప్పుడు లేబరు కమీషనరుకు యెరిగింప వలెను. ఆయనను వాటికి అనుకూలముగా ఉండేట్టు చీరాల కార్మికు లిప్పటినుంచి బహిరంగ సభల ద్వారా, కరపత్రాల ద్వారా, పత్రికల ద్వారా, ప్రదర్శనాల ద్వారా, ఆందోళన ప్రచారము చేసుకుంటూ పరిస్థితులను అనుకూలంగా తయారు చేసుకోవలెను. కార్మికులుచేయు యీ ఆందోళనలో కాంగ్రెసు నాయకులు, సోషలిస్టులు పూర్తిగా సాయపడవలెను. సంఘం యొక్క కార్యనిర్వాహక వర్గంవారు యెంక్వైరీని నడుపుటకుగాను ఒక సబ్‌కమిటీని నియమించవలెను. ఆ కమిటిలోకి కొంత మంది కాంగ్రెసు నాయకులను సోషలిస్టులను తీసుకొనవలెను.



# లేఖలు

### ఎయిడెడ్ ఉపాధ్యాయుల కష్టాలు.

విద్యాశాఖలో మ్యునిసిపలు, బోర్డు, ఎయిడెడ్ స్కూళ్ళని మూడు విధములగు పాఠశాల లుండుట మీకు విదితమే. ఈ త్రివిధ పాఠశాలలును ఒకే విద్యాభాగములోనివే యైనను, యిందలి ఉపాధ్యాయుల జీతబత్తెముల జూచిన చాల తారతమ్యములో నుండును. ఉదాహరణకు, ఒక హయ్యరుగ్రేడు టీచర్ల జీతములను తీసుకొందము. ఈ హయ్యరుగ్రేడు టీచర్లు ఒకే పరిపాలనలో, ఒకే శాఖలో, ఒకే పాఠశాలలో ఉత్తీర్ణులైనప్పటికిన్నీ బోర్డు స్కూళ్ళలో ఉద్యోగము లభించినవారికి నె 1 కిరు 20 లు లభించును. మ్యునిసిపాలిటీలో ఉద్యోగము సంపాదించుకున్నవారికి రు 25-35 లు సంపాదించుకొందురు. కాని యీ ఎయిడెడ్ స్కూళ్ల ఉపాధ్యాయుల కర్మ మేమి కాలిపోయిందో కాని, వీరికి నె 1 కి రు 13 ల కంటె ఎక్కువ ప్రకటించరు. ఇదైనను ప్రకటనలో మాత్రమే. ఉపాధ్యాయుని కీ మొత్తం ముట్టునప్పటికి రు 8 లే యగును. తక్కినది ఎయిడెడ్ స్కూళ్ళ మేనేజర్లు మ్రింగి వేయుదురు.

ఈ మేనేజర్ల గురించి కొంత ముచ్చటించ వలసియుంది. మన దేశమందలి జమీందార్లు సామ్రాజ్యవాదానికి యెంత ఆయువుపట్టో మీకు తెలియనిది కాదు. కాని బ్రిటిషువాళ్ళ గొడుగు క్రింద నున్న యీ జమీందార్ల పాలన యెంతటి నిరంకుశముగ నుండునో అది కూడ మీ రెరుగనిది కాదు. అదే విధముగ మన రాజధానిలోని విద్యాశాఖలో యీ మేనేజర్లు కేవలము జమీందార్లవలె నున్నారు. విద్యా వ్యాప్తికి యీ మేనేజర్లు యెంత సహాయపరులుగా నున్నారో యను విషయమే ప్రభుత్వము గుర్తించును గాని, మేనేజర్ల క్రింద మట్టగింపబడుచు, హృదయము కుములునట్లు, రక్తమాంసముల వ్యయపరచుచు విద్యా వ్యాప్తికి అసలు ముఖ్య కారకులుగానున్న మమ్ము ప్రభుత్వము కన్నెత్తి చూడకుండుట మా దురదృష్టము.

మా పాపకర్మ యేమో గాని, మా విషయ మెవరి దృష్టియందును బడుటలేదు. ప్రభుత్వము మా మొరాలకింపదు. ప్రజలా, మా గోడును వినిపించుకొనరు. ప్రజాసేవకు లన్ననూ వారికి మా కష్టములు తెలియునో, తెలియవో! అందుకు మా పై డిపార్టుమెంటులను నాధుడున్నాడుగదా! ప్రభుత్వమునకు మేము కేవలము విడిచి పెట్టిన భార్యలవలె నున్నాము. మా కిచ్చు జీతములు కేవలము మనోవర్తుల వలె నున్నవి. దాని కైనను యెన్నో రూల్సు, యెన్నో నిబంధనలు, మరెన్నో నిర్బంధములు.

మా కిచ్చు స్వల్ప వేతనములతో మా జీవిత నావను యెట్లు నడుపవలయునో కొంచెమాలోచించండి. రష్యాలో, ప్రాథమికోపాధ్యాయునకు నెల 1 కి రు 250 లట. ఆహా! అటువంటి ప్రభుత్వము, అట్టి జీతములు మాకెప్పుడు లభించునో కదా! జీతముల నెక్కువ చేయవలసినదని ప్రభుత్వమునకు మొఱపెట్టుకొన్నచో, బొక్కసమున ధనము లేదందురు. మరి యీ యుద్యోగస్థుల కందరకు వందలు వందల జీతములు యెచ్చట నుండి వచ్చుచున్నవో తెలియకున్నది. అందరు ఉపాధ్యాయ వృత్తిని ప్రశంసించువారే, గాని వారి స్థితిని గూర్చి ఆలోచించువారు ఒక్కరు కనబడరు. ప్రభుత్వమునకును మా యొద్దకు వచ్చునప్పటికే ధనము లేకపోవుచున్నది. ఉద్యోగస్థుల జీతములు తగ్గింపకూడదా! మేము ఆకలి మంటతో చస్తుంటే వారి కంతంత జీతము లెందుకు చెప్పండి. ఇనుప పెట్టెలలో ధనము క్రుళ్ళుచున్నది' ధనికులపై వివిధములగు పన్నులు వేసిన, ప్రభుత్వమునకు కావలసినంత ధనము.

ఉద్యోగస్థులకు ప్రయాణ ఖర్చులు ప్రభుత్వము యిచ్చుచునే యున్నది కదా! మేమును వారి వలెనే మనుష్యులము కదా! మా కింత స్వల్ప వేతనము లెట్లు సరిపోవునో సెలవివ్వండి. మాకు జీవించుటకు తగినంతే వేతము కోరుచున్నాము. నవనాగరికతా భోగభాగ్యములేమియు మేము కోరుట లేదు. ఆఖరకు బోర్డు, మ్యునిసిపలు పాఠశాలలలో నున్నంత జీతములనైనను యిప్పించవలసినదని కోరుచున్నాము. మా దురదృష్టవశాత్తు మేము మనుష్యులమై పుట్టితిమి కదా! మాకు ఉండుటకు యిండ్లు అక్కర లేదా? భోజనము అవసరము లేదా? ఆలు బిడ్డలక్కఱ లేదా? విద్యాది సౌకర్యములక్కఱ లేదా? యెంత ఖర్చు? యెంత ఖర్చు? ఈ ఖర్చులు పోవు మార్గములేదు కదా? యీ రు. 7, 8 లు ఒక్కని భోజన ఖర్చునకైనను సరిపోదే! అది గాక, యీ మేనేజర్లు మా కింత యన్యాయము చేయు చున్నారన్న విషయము వీరికి తెలియనిదా? మంత్రి మొదలు పుపాధ్యాయుని వరకు గల యుద్యోగ వర్గ మంతయు నెఱుగునే! ప్రభుత్వమునకు యేమీ తెలియ నట్లుండిన యీ యపఖ్యాతి పోవునా! యీ క్రుళ్లంత వెనుకటి మంత్రుల పాలనలో యుండనే యున్నది. అందు అబ్బుర పడవలసిన పనే లేదు. కాని కాంగ్రెసు ప్రభుత్వం యెప్పుడు వచ్చునా, మా కష్టము లెప్పుడు గట్టెక్కునా, యని స్వాతి చిప్పల వలె ఎదురు చూస్తూ దాని విజయమునకు కాయ శక్తుల పాటుపడిన మాకు యింత వరకు యీ పాప విమోచనము కలుగకుండుటకే యాశ్చర్య పడవలసి యున్నది. సంవత్సరం పైగా గడచినది. మద్యపాన నిషేధము, రైతు ఋణ నివారణ నిర్బంధ హిందీ పఠనము మొదలుగా గల సత్కార్యము లెన్నో జరుగుచునే యున్నవి. గాని విద్యా శాఖ యందు మాత్రము యింతవరకు యే మాత్రము మార్పు జరిగినట్లు కనపడదు. మా కష్టములు మంత్రి వర్యు లెఱుగరా! మా కష్టముల నుండి మమ్ము వుద్ధరింప పూను కొనరా?

మా బ్రతుకంతయు మేనేజర్ల దయా దాక్షిణ్యములపై నాధారపడి యున్నది. ప్రభుత్వము గ్రాంట్లు పద్ధతితో మమ్మట్లు చేసినది. మేనేజర్లు మా పై చలాయించు నిరంకుశత్వమునకు అడ్డులేదు. వారి అన్యాయముల బయట బెట్ట కూడదు. ఉపాధ్యాయ సంఘములలో జేర కూడదు. యెట్టి పరిస్థితుల యందెదురాడినను, మరుక్షణమున మేము నిరుద్యోగుల సంఖ్యలో జేరవలసినదే. వారు పెట్టుమన్న మొత్తములకు సంతకములు పెట్టి తీరవలసినదే. పై యధికారులకు పితూరీ చేసుకొన్న లాభము లేదు. వారు యెదురు కోపింతురు. అధికారులే తమ విద్యుక్త ధర్మమును నెరవేర్చు చున్నచో మాకీ తిప్పలుండనే యుండవు. పితూరీ చేయుటకైనను మాకు ధైర్య మెక్కడిది? ఈ కాస్త వుద్యోగమూ వూడిన యింక మాకు దిక్కేమి? గ్రుడ్డిలో మెల్ల యన్నట్లు అసలు లేనిదానికన్న యిదే మేలు గదా?

మా పుపాధ్యాయులలోనూ అనేక దోషములుండవచ్చును. కాని వాటిని వారిచే ప్రభుత్వమే చేయించుచున్నది. "అన్నమును బెట్టి పని చేయించుకొను" మను సూత్రమును ప్రభుత్వము గుర్తించిన, మేలు.

మా కష్టము లెంత జెప్పినను తీరవు. ఇకనైనను ప్రభుత్వమువారు మా మొఱాలకించి మా కష్టములను గుర్తించి మమ్ముద్ధరించెదరని నమ్ము చున్నాము. ప్రజలు మా యందు సానుభూతి గలిగి యుందురని నమ్ము చున్నాము.

అన్యాయము నశించు గాక. దారిద్ర్యము తొలగు గాక. లంచగొండి తనం రూపు మాయు గాక.

ఇట్లు,
ఎ. వి. సుబ్బారావు, (ఉపాధ్యాయుడు)

***

### ఆంధ్ర గ్రంథాలయములకు విజ్ఞప్తి.

కట్టు దిట్టములతో పనిచేయు సంఘముల ద్వారా నేడు ప్రపంచ మందలి అన్ని వృత్తులవారు, అన్ని తరగతిలవారు స్వాభివృద్ధిని పొందుచున్నారు. ఇప్పుడు జీవితముయొక్క సమస్త శాఖలలోను వివిధములగు సంఘములు బయల్వెడలి చక్కని యభివృద్ధిని సాధించు చున్నవి. కాని గ్రంథాలయముల అభివృద్ధి నిమిత్తం 1914 వ సంవత్సరములో యేర్పడిన ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘ కార్య క్రమము దాని వయస్సుకు తగిన ఫలితము నిచ్చినట్లు చెప్ప జాలము. ఆంధ్ర దేశమున నచ్చటచ్చట జిల్లా, తాలూకా, పట్టణ గ్రంథాలయ సంఘము లేర్పడినను ఇవియన్నియు నొక్కొక్కటిగా బల యుతములుగాక, పరస్పరముగా గాని, కేంద్ర సంఘములతోగాని నిర్దిష్ట సంబంధములేని కారణమున నొక నిర్ణీత కార్య క్రమమును సాధింపజాల కున్నవి.

ఈ పరిస్థితు లిట్లుండ లేని స్థాపన, అభివృద్ధి కొరకు నిరంతము యీ సంఘములన్నియు కృషి చేయు సంకల్పముతో నందు నిమిత్తము తంటాలు పడుచు, తమ కార్య క్రమము నింకను పట్టువలతో కొనసాగించ నెంచు చున్నామో, ఏ సంస్థల యొక్క నిర్వాహకుల అనుభవ, యోచనల ఫలితముగ తమ యభివృద్ధి కగత్యములను తలంపున నీ సంఘము లేర్పరుప బడినవో, అట్టి గ్రంథాలయోద్యమమునకు మూలస్తంభములనదగు గ్రంథాలయములొక్కొక్కటి తమ సంఘముల అభివృద్ధికై చూపు నాతురత అంతగా కన్పట్టదు. తమకై యేర్పడిన సంఘముల గ్రంథాలయములే ఆదరించ వాని యందు సభ్యులుగ జేరుటకు ముందుకు రానప్పుడే గ్రంథాలయముల యునికి కొకయర్థ ముండదు. దాని వలన గలుగు ప్రయోజనమును గానరాదు.

గ్రంథాలయమే ఒక సంఘము. అందు వలన సంఘ శక్తిని గూర్చి గ్రంథాలయ నిర్వాహకులకు చెప్పవలసిన పని యుండదు. ఇతరులెవ్వరును చేయని కార్యములను చాలగా గ్రంథాలయోద్యమమున సాధించిన మనము (ఆంధ్రులము) సంఘ కార్య క్రమమును చక్కని యేర్పాటుతో సాగించి మన యుద్యమమును తగిన విధమున ప్రకటించి ప్రచారము చేయ జాలని కారణమున పొరుగువాని అన్యాయపు వ్రాతలకు గురి అయి బాధనంది మన యసమ్మతుల పుంఖాను

(మిగతా 22 వ పేజీలో)

# జకోస్లావేకియాలో నిజంగా జర్మనులు బాధ పడుతున్నారా?

## ఈ కల్లోలానికి మూల కారణాలు ఏమిటి?

శ్రీ కె. సత్యనారాయణ, బి. ఏ. (ఆనర్సు) బి.యల్.

1914—18 లో జరిగిన యుద్ధం. ప్రపంచంలో యుద్ధాలను అంతరింపజేసే పవిత్ర యుద్ధం అన్నారు యూరపులోని రాజకీయ వేత్తలందరూ. సామ్రాజ్యవాద తత్వమును గ్రహించిన "లెనిన్" మహాశయుడు ఈ అభిప్రాయముతో ఏకీభవించ లేదు. కాలనీల పంపకం కొరకు, సామ్రాజ్యవాదులు ఆ యుద్ధమునకు కారకులని ప్రపంచంలో సామ్రాజ్యవాదం నశించ నంతవరకు యుద్ధములు తప్పవని. ప్రపంచ శాంతి స్థాపించుటకు సామ్రాజ్యవాదమును నశింపచేయ వలెనని చెప్పాడు లెనిన్.

యుద్ధానంతర పరిస్థితులు గ్రహించిన ప్రతివారికి లెనిన్ వాక్కులు ఎంత సత్యములైనవో తెలుస్తుంది.

జెకోస్లొవేకియా సమస్య గూడ. సామ్రాజ్యవాదులు. యుద్ధానంతరం బయలుదేరిన ఫాసిస్టులు. కల్పించిన సమస్యయని నిరూపించుట ఈ వ్యాసముయొక్క మొదటి ఉద్దేశ్యము. రెండవది: జెకోస్లోవేకియాలోని 35 లక్షల జర్మనుల యొక్క హక్కులను సంరక్షించుటయేనా హిట్లర్ యొక్క ప్రధానమైన నిజమైన ఉద్దేశ్యం? మూడవది; బ్రిటన్ వైఖరి. సామ్రాజ్యవాదమునకు ఫాసిజమునకు గల సంబంధం చర్చించుట.

1914—18 యుద్ధ పూర్వపు ఆస్ట్రియా సామ్రాజ్యం, యుద్ధానంతరం 4 రాజ్యములుగా విభజింపబడెను. 1. ఆస్ట్రియా 2. హంగేరీ 3. జెకోస్లొవేకియా 4. యుగోస్లేవియా. పూర్వపు ఆస్ట్రియా సామ్రాజ్యములో వివిధ జాతులవారు కలసిపోయి కొన్ని వందల సంవత్సరముల నుంచి స్థిరముగా నివశించుచుండుట వల్ల, వివిధ జాతులవారిని వేరుచేసి, జాతుల ప్రకారం విభజించడం కష్టమయింది. ఫలితం: జెకోస్లొవేకియాలో ఈరోజు 75 లక్షల జెక్కు జాతివారు, 20 లక్షల స్లోవక్ జాతివారు, 35 లక్షల జర్మన్‌లు, ఇంకా పోలిష్, యుక్రేనియన్ మొదలైన జాతులవారు కలరు.

జెకోస్లొవేకియాలో ఈరోజు జర్మన్‌లు నివసిస్తున్న ప్రదేశాలు (బొహీమియా రాష్ట్రం, సరిహద్దు ప్రాంతాలు) ఎప్పుడూ జర్మనీకి చెందినవికావు, ఇంతేగాక, జర్మన్ లనబడే 35 లక్షల మంది, కొన్ని వందల సంవత్సరముల క్రింద బొహీమియాకు వలస పోయిన జర్మనీ దేశస్థుల వంశములకు చెందినవారు.

ఇంకో విషయం గూడ గమనించాలి: అనేక జాతులున్న దేశములలో, అధిక సంఖ్యాకులుగా ఉన్న జాతివారు ఇతరులను ఏదో విధముగా బాధిస్తూనే, ఉంటారనే సంగతి వెర్సైల్ సంధి కారకులగు సామ్రాజ్యవాదులు గ్రహించలేదు. జెకోస్లొవేకియాను స్వతంత్ర రాజ్యమును చేసి, ఆస్ట్రియా సామ్రాజ్యము నుంచి వేరు చేయుటలో, సామ్రాజ్యవాదుల ఉద్దేశ్యం వేరు. జర్మనీకి, జెకోస్లొవేకియాకు మధ్యగల సరిహద్దు ప్రాంతములను జాగ్రత్తగా పరిశీలిస్తే, సూడెటన్ ప్రాంతమంతా అభేద్యమైన కొండలలో నిండియున్నది. జర్మనీ, తూర్పు యూరపులో ఎప్పుడు తిరిగి తల యెత్తకుండా, కొండలతో కూడిన ఈ జెకోస్లొవేకియా యొక్క సరిహద్దు ఉపయోగిస్తుందని వీరి ఉద్దేశ్యం. ముఖ్యంగా, జర్మనీకి జన్మ శత్రువైన ఫ్రాంసు ఉద్దేశ్యమిది.

1917 లో రాజ్యాధికారము స్వాధీనము చేసుకొన్న బోల్షివిక్కులు, అధిక సంఖ్యాకులైన జాతికి చెందిన దేశంలో బలవంతంగా కొద్ది సంఖ్యగల జాతులవారిని (ఉ॥ 35 లక్షల జర్మనులు) ఉంచడం భావి శాంతికి భంగకరమని, ఏ జాతివారు ఆ జాతికి చెందిన దేశమునకు పోవు అధికారము ఇవ్వవలెనని, వెర్సైల్ సంధి కర్తలతో హెచ్చరించారు. ప్రజా క్షేమము పాటింపని సామ్రాజ్యవాదుల ఎత్తుల ముందు, ఇటువంటి సూచనల ప్రయోజనం? ఫలితం, 35 లక్షల జర్మనులను జెకోస్లొవేకియాలో బలవంతంగా ఉంచారు.

### హిట్లర్ యుద్ధ తత్వం : జెకోస్లొవేకియా.

జెకోస్లొవేకియా అప్పటినుంచి, హిట్లర్ బెదరించే రోజువరకు 'ప్రజాస్వామ్య' రాజ్యమని పేరు పొందినది. హిట్లర్ అధికారమునకు వచ్చిన జర్మని విదేశాంగ రాజనీతి (Foreign Policy) పూర్తిగా మారిపోయినది. క్రిందటి యుద్ధములో గోల్పోయిన కాలనీల నన్నిటిని సంపాదించి, సామ్రాజ్యమును స్థాపించాలని జర్మన్ ఫాసిస్టుల ఉద్దేశ్యం. ఈ ఆశయము నెరవేరుటకు ఫాసిస్టు దేశములు యుద్ధమునకు దిగక తప్పదని ఫాసిస్టు దేశముల (ఇటలీ, జపాన్, జర్మనీ) వైఖరి గ్రహించిన ప్రతివారికి తెలుసును. ఫాసిజమునకు బలి అయింది ఆస్ట్రియా. ఇప్పుడు జెకోస్లొవేకియా వరుస వచ్చింది.

జెకోస్లొవేకియాలోని జర్మనులను జెక్ ప్రభుత్వము పీడిస్తుందని, జర్మనులకు వేరే రాష్ట్రము (సూడెటన్) కావలెనని, సూడెటన్ రాష్ట్రమును జర్మనీతో కలుపుకొనుట న్యాయమని హిట్లర్ దొంగవాదన. ఈ ఎత్తుకు ఒకటే అర్థం. తూర్పు యూరపులో ఉన్న చిన్న రాష్ట్రములను ఒకటి తరువాత ఒకటిని మ్రింగి. తరువాత సోవియట్ యూనియన్‌లోని యుక్రెయిన్ రాష్ట్రమును స్వాధీనపరచుకొనవలెనని ఆశిస్తున్న ఫాసిస్టు హిట్లరుకు, జెకోస్లొవేకియా, దానిలోని సరిహద్దు రాష్ట్రమైన సూడెటన్‌లోని కొండల వరుస, అడ్డమవుతయి. అంతేగాక, జెకోస్లొవేకియాలోని ఆయుధపు ఫ్యాక్టరీలు, రుమేనియాలోని నూనె ఇనుప గనులు, తరువాత ఫాసిస్టు ఆశయాలకు (ఫ్రాంసును జయించుటకు) తోడ్పడుతయి. ఫ్రాంసు, సోవియట్ రష్యాల స్నేహముగా ఉన్న జెకోస్లొవేకియా జర్మనీకి ఎప్పుడైనా శత్రువే.

ఫాసిస్టు యుద్ధపు ఎత్తులు కానిచో, జెకోస్లొవేకియాలోని జర్మనులకు నిజంగా ఎంతవరకు ఇబ్బందులున్నవో కొంచెం తెలుసుకుందాం.

1935 జనరల్ ఎలక్షన్‌లో, జెక్ పార్లమెంటులో 300 స్థానములకు, 72 స్థానములు జర్మనులకు వచ్చినయి. (24%) జనసంఖ్య ప్రకారం 20% గూడ వచ్చుటకు వీలులేదు. జర్మన్ జాతికి చెందిన పిల్లలందరికి (70%) జర్మన్ భాషలో బోధించే పాఠశాలలున్నయి. ఇటలీలో జర్మన్ బాలురకు జర్మన్ స్కూళ్ళులేవు. నూటికి 20 మంది జర్మనులు ప్రభుత్వోద్యోగులు గాను, సైనికోద్యోగులు గాను ఉన్నారు. కోర్టులలోను, అవసరమైన ఇతర ఆఫీసులలోను జర్మన్ భాషకు స్థానమున్నది.

జర్మనీలో, ఇతర జాతుల నెంత హీనముగా చూస్తూ, బాధిస్తున్నదీ పరిశీలిస్తే, జెకోస్లొవేకియాలో జర్మనుల పరిస్థితులు వెయ్యి రెట్లు మెరుగు. ఏ కాపిటలిస్టు దేశములోను అల్పసంఖ్యాకులకు (National Minorities)కు ఇటువంటి మంచి పరిస్థితులు లేవు.

### బ్రిటన్ వైఖరి.

1. ఫాసిస్టు దేశాలు లొకార్నో (locarno) మొదలగు సంధు లనేకములను ధిక్కరించినప్పటికి నోరు మెదల్చకుండుట, 2. తనకు హానికరమైనా అబిసీనియాను ఇటలీ స్వాధీనము చేయుట 3. తటస్థ విధానమనే పేరుతో స్పెయిన్‌లోని విద్రోహులకు (Rebels) సహాయ మొనర్చుట 4. విద్రోహులు తన యుద్ధపు ఓడలమీద బాంబులువేసినా తటస్థముగా ఉండుట 5. ఆస్ట్రియా స్వాతంత్ర్యమును కాపాడుట తన బాధ్యత అయినప్పటికి, జర్మనీ స్వాధీన మొనర్చుట మొదలైన విషయముల వల్ల బ్రిటన్ ఫాసిస్టులకు తోడ్పడుతున్నదని చెప్పక తప్పదు. జెకోస్లొవేకియాను మ్రింగబోతున్నా బ్రిటన్ తటస్థముగా ఉంటుందా? యీ ప్రశ్నకు, ఫ్రాంసు వైఖరికి సంబంధము కలదు.

ఫ్రాంసుదేశము జర్మనీ యుద్ధ తత్వమునకు ఒప్పుకొనదు. సరిహద్దు రాజ్యమైన జర్మనీ బలము ఎక్కువయినచో ఫ్రాంసు దేశమునకు మొప్పము వాటిల్లును. జర్మనీకి బ్రిటన్ సహాయం చేయుటవల్ల (తాత్కాలికంగానే కావచ్చు, కొన్ని ఉద్దేశ్యములతో) ఫ్రాంసు అనుమానములు ప్రబలి, సోవియట్ యూనియన్‌తో పాటు జెకోస్లొవేకియా వైపున జర్మనీతో యుద్ధ మొనర్చుటకు తయారగుచున్నది.

ఎట్టి పరిస్థితులలోనైనా బలహీన మగుచున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ప్రపంచ యుద్ధము రాకుండా ప్రయత్నించెదరు. రన్సిమన్ రాయబారములు మొదలైన ప్రయత్నములు హిట్లర్‌ను ఏదో విధముగా సమాధానపరచుటకు ఒక కమీషన్‌ను నియమించి అరేబియా దేశమును జ్యూమతస్థులకు, అరబ్బులకు విభజించి అరేబియా దేశమును జ్యూలకు స్వాధీన పరచినట్లు బ్రిటన్ జెకోస్లొవేకియాలో గూడా ప్రయత్నిస్తుంది. కాని అటువంటి సంధికి ఫ్రాంసు అంగీకరించునా?

[ఈ వ్యాసం 15 వ తేదీన వ్రాశారు. తర్వాత ఘటనలన్నీ పాఠకులకు ఎరుకయే. బ్రిటిష్ కుతంత్రానికి ఫ్రాంసుకూడ లొంగి జెకోస్లొవేకియాను ఛిన్నా భిన్న మొనర్చుట కంగీకరించడం చూస్తూనే ఉన్నాము.

— సంపాదకుడు]

## పత్రికావిలేఖరి అగచాట్లు

(5 వ పేజీ తరువాయి)

నన్ను చూసి మందహాసం చేసింది. మృత్యుదేవత నా ముందుకు వచ్చి వికృతహాసం చేసినట్లుగా తోచింది నాకు.

"నీవు కమ్యూనిస్టువు కాదా" అని ఆమె మొదటి ప్రశ్న.

"కాన"ని చెప్పాను.

"పోనీ సోషలిజం అంటే నమ్మకంపుందా?"

"ఆః వుంది"

"నీవు వెలెన్షియాలో కొంతకాలం వున్నావా"

"అవును. పత్రికా విలేఖరిగా"

"అయితే నీకు చావు తప్పదు"

"ఎందుచేత" నన్నాను.

"నీవొక గూఢచారివని అనుమానం" అని నేనేమీ చెప్పకుండానే "నీకు చావు తప్పేమార్గం చెప్పనా" అంది.

చెప్పమని తల ఊపాను.

"ఫ్రాంకోను ఎరుగుదువా?" అంది.

"పేరు మాత్రం విన్నాను. వ్యక్తిగతో పరిచయం లేద"ని చెప్పాను.

ఆమె గబగబా కాగితం కలంతీసి "ఫ్రాంకోను నేను వ్యక్తిగతంగా ఎరుగను. అతడు నన్నూ ఎరుగడు. కాని ఆయననన్ను విడిచిపెడితే ఆయనకు కృతజ్ఞుడను. సోషలిస్టు ప్రభుత్వంలో నైతే నా విడుదల జరగదు" అని పరపర వ్రాసి "సంతకం పెట్టు"మని నాకందిచ్చినది. ఆశ్చర్యపోయాను. మొదట్లో సంతకం చేయకూడ దనుకున్నా. కాని ఖర్మంజాలక విడుదల పొందితే ఈ ఉదంతం ఉపయోగపడక పోదనుకుని సంతకం గీకాను. ఆ స్టేటుమెంటు నా విడుదలకు సహాయపడక పోయినా, విద్రోహుల కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారాని మాత్రం తోడ్పడి వుంటుంది. ఆత్మ విశ్వాసం చంపుకుని విడుదల కాశించి వెధవపని చేసానే అని మనస్సు చాలా బాధపడింది. అయితే ఏం? వృధాగా చచ్చిపోవడం కంటె ఇప్పుడు వానిని ప్రకటించ గలగడం అంతకంటె మంచి పని కాదూ?



# అఖిల భారత కాంగ్రెస్ సమావేశం

## చర్చలు — తీర్మానాలు

### మహాత్ముని శాంతి దళం.

22-9-38 వ తేదీ మధ్యాహ్నం కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులు హరిజన కాలనీలో సమావేశమయారు. శాంతిదళాన్ని గురించి గాంధీ మహాత్ముడు వారితో రెండు గంటల కాలం వ్రాత మూలకంగా సంభాషించారు. "అహింసను గురించి యింకపైని కాంగ్రెసువాదులు తటస్థంగా ఉండడాని కేమాత్రము వీల్లేదు. అహింసా సూత్రాన్ని స్పష్టంగా తెలుసుకొని, మిన్ను విరిగి మీదపడ్డా, దాన్ని తప్పకూడదు.... మళ్ళీ ప్రపంచ యుద్ధం ప్రారంభమవుతుందనే వార్తలు హెచ్చుగా వినబడుతున్నాయి. ఈ గందరగోళం తగ్గడానికి కాంగ్రెసువారు తమ అభిప్రాయాన్ని నిర్ధారణగా ప్రకటించవలసిన అవసరం యిప్పుడు ముఖ్యముగా ఏర్పడింది." అని మౌనవ్రతంలో ఉన్న మహాత్ముడు తెలియజేశాడు. కాంగ్రెసు వాదులలోగల దౌర్జన్యాన్ని అణచడాన్ని గురించి చర్చ జరిగింది. చాలామంది నాయకులు మాట్లాడారు.

23-9-38 వ తేదీని గాంధీగారు చేసిన అరువారముల మౌనవ్రతాన్ని ముగించి, వర్కింగ్ కమిటీ సభ్యుల యెదుట ప్రసంగం చేశారు. ఆయనకు అతి ప్రియమైన "సత్యము-అహింస" అనే విషయాన్ని గురించే సంభాషించారు. ఈ సిద్ధాంతాన్ని అమలులో పెట్టుటకు శాంతి దళం ఒకటి అత్యంతావసరమని సూచించారు.

### ఫెడరేషన్

24-9-38 వ తేదీని వర్కింగ్ కమిటీ సమావేశమై, ఫెడరేషన్‌ను గురించి హరిపుర కాంగ్రెసు మహాసభలో ఆమోదింపబడిన తీర్మానాన్నే తిరిగి ప్యాస్ చేశారు. ఢిల్లీ యందలి కేంద్ర శాసన సభను పొడిగించడం వల్ల, దేశంలో ప్రతిష్ఠంభన కలిగి తీరుతుందని బ్రిటిష్ ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ ఒక వాక్యం తీర్మానంలో చేర్చబడింది.

### ఖరే వృత్తాంతం.

డాక్టర్ ఖరే యొక్క చర్యను ఖండిస్తూ వర్కింగ్ కమిటీలో యిదివరకు ఆమోదింపబడిన తీర్మానాన్నే తిరిగి బలపరచారు.

## అ. భా. కాం. కమిటీ సమావేశం

### ఖరేపై తీర్మానం.

24-9-38, 25-9-38 తేదీలలో అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశం అయింది. పూర్వపు మధ్య రాష్ట్ర ప్రధాన మంత్రి అయిన డాక్టర్ ఖరేగారి చర్యలను ఖండిస్తూ తీర్మానించబడింది. డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు తీర్మానాన్ని ఉపపాదించారు. శంకరరావు దేవుగారు బలపరిచారు. దీనిపై విచారణ చేయవలసినదని డాక్టర్ సన్యాల్, సహస్ర బుద్ధి గారలు రెండు సవరణలు ప్రతిపాదించారు. ఖరేగారిపై కాంగ్రెస్ కమిటీ డిసిప్లినరీ చర్య తీసుకోవాలి అని బాలకృష్ణ శర్మగారు మరొక సవరణను తెచ్చారు. యం. యస్. అనీగారు తీర్మానాన్ని, సవరణలను వ్యతిరేకిస్తూ, ఖరేను సమర్థిస్తూ దీర్ఘోపన్యాసంచేశారు. సర్దార్ పటేలుగారు మొదటినుంచీ డాక్టరు ఖరేర్ చేసిన తప్పులు, ద్రోహం, పూసగుచ్చినట్లు చెప్పి అసలు తీర్మానాన్ని బలపరుస్తూ మాట్లాడారు. యం. యస్. రాయిగారు, ఖరే చేసింది తప్పే అయినప్పటికి ఒక విచారణ కమిటీని వేయాలన్నారు. "ఇష్టంలేని వారినందర్నీ తొలగిస్తే ఇక మిగిలే వారెవరు?" "అంటూ రాయ్‌గారు ప్రజాతంత్ర సూత్రాలమీద ఉపన్యాసం చేశారు." సరియైన వ్యక్తులే మిగిలేవార"ని సభలో యెవరో జవాబు చెప్పారు. "మీకు నేను సరియైనవాడిని కాకపోతే, మీరు కూడా నా దృష్టిలో సరియైనవారు కారు." అని కోపంతో రాయిగారు సమాధాన మిచ్చారు.

మద్రాసు ప్రధాని శ్రీ రాజగోపాలాచారిగారు కూడా చర్చలో పాల్గొన్నారు. నూతన రాజ్యాంగ చట్టాన్ని అమలు పరచుటకు రాజగోపాలాచారిగారు మద్రాసు గవర్నరుతో ఒడంబడిక చేసుకొన్నారని ఖరే మోపిన నింద వట్టి అబద్ధం అని స్పష్టపరుస్తూ మద్రాసు ప్రధాని ఉపన్యసించారు.

డాక్టరు ఖరేపై డిసిప్లినరీ చర్య తీసుకొవాలని బాలకృష్ణ శర్మగారు ప్రతిపాదించిన సవరణను డాక్టరు పట్టాభిగారు అంగీకరించారు. సవరణను వోటుకు పెట్టగా, 151 మంది అనుకూలంగాను, 61 మంది ప్రతికూలంగాను వోటు చేశారు.

ఖరే చర్యను గురించి విచారణ చేయాలి అనే సవరణలు రెండూ అత్యధిక సంఖ్యాకులచే ఓడిపోయాయి. తీర్మానం నెగ్గింది.

### సంస్థాన ప్రజలు

అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశములో సత్యమూర్తిగారు సంస్థాన ప్రజల తీర్మానం ప్రవేశపెట్టారు. ఇది వర్కింగ్ కమిటీ వారిచే తయారు చేయబడిన తీర్మానం. తీర్మానంలో తిరువాన్కూరు నిర్బంధాలను గురించి విచారం తెలియజేస్తూ, స్టేట్ కాంగ్రెసు బాధ్యతాయుత ప్రభుత్వానికై చేస్తూన్న ఆందోళనను సమర్థిస్తూ, సంస్థాన ప్రభుత్వంవారు బాధ్యతాయుత పరిపాలన యివ్వడం విషయమై విచారణ చేయడానికి ఒక కమిటీని నియమించాలనీ ఇటీవల నిర్బంధ విధానాన్ని గురించి నిష్పాక్షిక విచారణ జరపాలనీ కమిటీవారు సూచించారు. హైదరాబాద్ సంస్థానములో ఆర్డినెన్సులు ప్రయోగించడం అనవసరమనీ, డెంకనాల్, కాశ్మీర్ వగైరా సంస్థానాలలో కూడా జరుగుతూన్న నిర్బంధ విధానం యెడల విచారము తెలియజేస్తూ తీర్మానించబడింది.

అయితే, అః భా. కాం. కమిటీ వెనుకటి తాటస్థ్య విధానాన్నే బలపరుస్తూ, సాధ్యమైన అన్ని విధాలా సంస్థాన ప్రజలకు సహాయం చేస్తూ ఉంటుందని ధృవపరుస్తూ, సంస్థానాధిపతులు తమ ప్రజలకు బాధ్యతాయుత పరిపాలన యివ్వడాన్ని బట్టి తమ క్షేమం ఆధారపడి యుంటుందని మిత్రభావంతో హెచ్చరిస్తూ (friendly warning) తీర్మానంలో చెప్పబడి ఉంది.

ప్రస్తుతం వివిధ సంస్థానాలలో నిరంకుశ విధానాన్ని యెదుర్కొంటూ ప్రజలు చూపుతూన్న ధైర్య సాహసములను, త్యాగశక్తిని ప్రశంసిస్తూ రంగాగారొక సవరణను ఉపపాదించారు.

శ్రీమతి కమలాదేవి చట్టోపాధ్యాయిగారు, సంస్కరణల కమిటీ విషయంలో "త్వరలో బాధ్యతాయుత ప్రభుత్వం నెలకొల్పడానికి" అని మార్పు చేయవలసిందని మరొక సవరణ ఉపపాదించారు.

"హైదరాబాద్ సంస్థానంలో ప్రయోగింపబడిన ఆర్డినెన్సులు రద్దుచేయ బడాలని సంస్థాన ప్రజలు చేస్తూన్న ఆందోళనను యీ సభవారు బలపరుస్తున్నారు" అని కామ్రేడ్ అన్నాప్రగడ కామేశ్వరరావుగారు యింకొక సవరణను ప్రవేశపెట్టారు.

కాని, సవరణలన్నీ వీగిపోయాయి. వర్కింగ్ కమిటీవారి మొదటి తీర్మానం అధిక సంఖ్యాకులచే ఆమోదింపబడినది.

### ఫెడరేషన్

ఫెడరేషన్‌ను గురించి వర్కింగ్ కమిటీ వారిచే తయారు చేయబడిన తీర్మానాన్ని బాబు రాజేంద్ర ప్రసాద్‌గారు ఉపపాదించారు. మున్షీ అహమ్మద్ దీన్ (పంజాబ్ సోషలిస్టు పార్టీ కార్యదర్శి) ఒక సవరణను, యం. యస్. రామ్ మరొక సవరణను, దత్తు మజుందార్ ఇంకొక సవరణను, డాక్టర్ అహమ్మద్ నాల్గవ సవరణను ఉపపాదించారు. కాని. అన్నీ వీగిపోయాయి. మొదటి తీర్మానమే అధిక సంఖ్యాకుల చేత ఆమోదించ బడింది.



## గ్రంథావలోకనము

పత్రికలు :—

### మహతి

మాసపత్రిక:

సంపాదకులు వాసిరెడ్డి వెంకట సుబ్బయ్యగారు:—తెనాలి.

* * *

మహతి మొదటి నాల్గు సంచికలు మా కార్యాలయానికి అందినవి. ఆంధ్ర సాహిత్యానికి చిరపరిచితులయిన వాసిరెడ్డి వెంకట సుబ్బయ్యగారు దీనికి సంపాదకులగుట ముదావహం.

పట్టాభి, చెళ్ళపిళ్ళ ప్రభృతుల ఆశీర్వాదాలతో ప్రారంభింప బడినదీ పత్రిక. నాల్గు సంచికలలోను, రాయప్రోలు, విశ్వనాథ, సీతారామమూర్తి చౌదరి, కవి రాజువంటి, సుప్రసిద్ధుల పద్య రచనలతోనూ, కొడవటిగంటి, గోపీచంద్ మొదలగు వారి కథలతోను, ఫేసిజం, రాచరికం, కాంగ్రెస్ లెఫ్టిజం, మొదలగు రాజకీయ వ్యాసాలతోను, నిండివుంది.

కేవలం రాజకీయమూ, కేవలము, సారస్వతమూ గాకుండా, రాజకీయ సారస్వతాల రెండింటికీ తావిచ్చే ఈ మాసపత్రికను ఆంధ్రులందరూ ఆదరించ గోరెదము.

* *

### కార్మిక పత్రిక

వారపత్రిక

సంపాదకులు పెమ్మరాజు వెంకట్రావుగారు, విడి ప్రతి అణా, సంవత్సర చందా, 4-0-0.

విజయనగరం

* * *

కార్మిక పత్రిక మొదటి రెండు సంచికలు మా కార్యాలయానికి చేరినవి.

రెండు సంచికలునూ కార్మిక సమస్యలనే పరిష్కరించు వ్యాసాలతో, కథలతో నిండివున్నాయి.

ఆయా ప్రదేశాలలో, ఆయా పరిశ్రమలలో కలిగే కూలీల కష్ట నిష్ఠూరాలను తెల్పుచూ వారికి సాయపడే ఈ పత్రికను, ఆంధ్ర కార్మికులందరూ ప్రోత్సహించాలి. కార్మికులే గాక, కార్మికోద్యమ మందు ఆదరాభిమానాలు గల వారందరూ ఈ పత్రికకు సాయము చేయాలని మాకోరిక.

*

### ఆంధ్రభూమి

మాసపత్రిక

సంపాదకులు ఆంధ్ర శేషగిరిరావుగారు.

వేపేరి—మద్రాసు.

* * *

ఆంధ్రభూమి—మద్రాసు సంచిక, ఒక ప్రత్యేక ఆకర్షణ. అక్టోబర్ నెలలో మద్రాసులో ఆంధ్రరాష్ట్ర సమస్యలలో మద్రాసు ఎవరిది అనేది ఒక సమస్య. ఇలాంటి సమయంలో ఈసంచిక వెలువడుట చాల ఉపయోగకరం.

మద్రాసు ఆంధ్రులదే అని నిరూపించే ప్రముఖ వ్యాసాలతో ఈ సంచిక విరాజిల్లుచున్నది.

## తిరువాన్కూరు కాల్పులు

(8 వ పేజీ తరువాయి)

స్తేనే గాని సంభాషణలు ముందుకు సాగేటందుకు వీలులేదని ప్రజా ప్రతినిధులనిరి. కాల్పులసలే జరుగలేదని దర్బారు ప్రతినిధులనిరి.

దీని విషయమై విచారణ కమిటీని ఏర్పాటు చేయాలనియు అందు అందరూ అనధికార సభ్యులుండాలని ప్రజా ప్రతినిధులనిరి. ఈ ఏర్పాటునకు ప్రభుత్వం అంగీకరించుట లేదు.

ఇదే సందర్భంలో ఒక స్పెషల్ ట్రెయిను నిండా బ్రిటిషు సేనలు ధేంకానల్ పిలిపింపబడినవి—వాతావరణం చాలా గందరగోళంగానున్నది.

20 వ తేదీని 25 గురిని సంస్థాన ప్రభుత్వం అరెస్టు చేసినట్లు వార్త ప్రకటింపబడింది. మిలిటరీ వారు గ్రామాలలోనికి కూడా పోవుచున్నారని వార్త వచ్చింది

ఇందునుగూర్చి ఒరిస్సా సంస్థాన ప్రజా కాన్ఫరెన్సు అధ్యక్షులయిన సారంగధర దాసుగారు మహాత్మా గాంధీగారికి విపులంగా తంతినిచ్చారు. శాంతి యుతంగా ఉండవలసినదని ప్రజలకొక హెచ్చరిక నిచ్చారు. గాంధీజీని కలుసుకొని మాట్లాడుటకు వారు వెళ్ళిరి. విచారణ కమిటీ ఫైల్సు హరింపబడినవి.

ఒరిస్సా సంస్థాన ప్రజా విచారణ కమిటీ ధేంకానల్, కియోంజార్ సంస్థానాలపై గావించిన విచారణ వివరాలున్న ఫైల్సు రెండూ, ఎవరో దొంగిలించారు. బృందావనదల్ అను ఆయనను యీ సందర్భంలో అరెస్టు చేశారు. అందులో కియోంజర్‌కు సంబంధించిన ఫైల్సు ధేంకానల్‌లోని ఒక పోలీసు ఉద్యోగి వద్దనున్నదని బయటపడింది.

తమ పరిపాలనలో నున్న ప్రజలనుభవించే విషాదగాథ బయటికి రాకుండ చేయుటకు సంస్థానాధీశు లెంతెంత పనులకు పాల్పడుచున్నారో చూడండి?

## భోపాల్

### బొంబాయి సివిల్ లిబర్టీస్ యూనియన్ వారి విచారణ నిరాకరించుట.

జవహర్లాల్ నెహ్రూగారు సంస్థానాలలో ప్రజా హక్కు లెంత దారుణంగా అణచివేయబడుచున్నదో తెల్పుతూ ఒక ప్రకటన మే నెలలో చేసిరి. ఇందులోని కొన్ని హంశాలను ఖండిస్తూ భోపాల్ దివానుగారు సమాధానాన్ని వ్రాసిరి. దివానుగారు చేసిన ప్రకటనలకు నమ్మకమగు ఆధారాలున్నచో తన ప్రకటనలోని ప్రతి వాక్యాన్ని మార్చుకొనుటకు తాను సిద్ధముగా నున్నానని జవహర్లాలుగారు చెప్పిరి. తరువాత వారు యూరప్ వెళ్ళిరి.

ఇటీవల యీ విషయాన్ని గురించి విచారణ చేయాలని బొంబాయి సివిల్ లిబర్టీస్ యూనియన్ వారు భోపాల్ సంస్థానమునకు జాబు వ్రాసిరి. యీ విచారణను నిరోధిస్తూ భోపాల్ సంస్థానాధీశుని వద్ద నుండి తిరిగి జవాబు వచ్చింది.

ఇంత భోపాల్ సంస్థానంలో నిర్బంధ విధానం ఎల్లా వుందో వేరే విచారణ అవసరం ఏముంది? దుర్భరమైన ప్రజా పీడనం జరుగుతోందని సంస్థానపు యీ జవాబే చెప్పుచున్నది.

## బెల్హార్

"గాంధీ టోపీ పెట్టుకొని, ఖద్దరు కట్టుకొని" మహాత్మా గాంధీగారి పేరు చెప్పియు సంస్థాన ప్రజలను కొందరు ఉద్రేక పూరితులను చేస్తూ మహాత్ముని ఆ పవిత్ర నామాన్ని మైలపరుస్తున్నారు గనుక, అట్టి చర్యల నన్నిటిని యీ సంస్థానంలో నిషేధిస్తున్నాము" అని బెల్హార్ సంస్థానము ప్రజాందోళనను నిషేధించింది.

బెల్హార్ సంస్థానంలోని ప్రజామండలిని దాని శాఖలను అక్రమ సంఘాలుగా ప్రకటించింది.

"సంస్థానంలోని ప్రజలందరూ తమ ఆయుధాలను ఆయా ప్రాంతాలందున్న పోలీసు స్టేషన్లలో అప్పగించ వలసినదనియు లేకున్నచో ఆయుధధారణ చట్టం క్రింద శిక్షలు వేస్తామనియు" సంస్థాన ప్రభుత్వం ప్రకటించింది.

మహాత్ముని పవిత్రనామంపై చూపిన యీ భక్తిలో నూరవ వంతును ఆయన ఆశయాలపై సంస్థాన ప్రభుత్వం చూపినచో ప్రజల నింత హింసించు నవసర ముండెడిది గాదు.

## హైదరాబాదు

### ఇంకొక నిషేధం.

సికిందరాబాదులో విద్యార్థులు విద్యార్థి సంఘాన్ని ఏర్పాటు చేయుటకు సమావేశము కాగా, దానిని ప్రభుత్వం నిషేధించి "వయస్సులో చిన్నవారు, రాజకీయ ఉద్దేశ్యములతో యీ సభ జరుపుతున్నారు గనుక నిషేధిస్తున్నాం" అని ప్రకటన చేసింది.

వెనుక కులతత్వం పేరుపెట్టి, స్టేట్ కాంగ్రెసును నిషేధించింది. ఇప్పుడు ఇది. దీనిలోన అంతరార్థం నిరంకుశపాలన కాక మరేమిటి?

## ప్రజామత సంపాదకులు

### బి. యన్. గుప్తాగారి అరెస్టు.

ప్రజామత కన్నడ వారపత్రికా సంపాదకుడు బి. యన్. గుప్తాగారు, బెంగళూరుకు 200 మైళ్ళదూరంలో వుండే దేవంజేరి అనుచోట అరెస్టయిరని అనధికార వార్తవలన తెలియుచున్నది.

సంస్థానంలో అశాంతిని పెంపొందించి కలతలు కలుగజేశాడనే నేరానికి, మైసూరు ప్రభుత్వంవారు గుప్తాగారిని తమ సంస్థానం నుంచి బహిష్కరిస్తూ 28-10-37 నేడు వుత్తర్వు చేశారు.

దేవంజేరికి, గుప్తాగారు, ఒక విల్ వ్యాజ్యం కొరకు, మైసూరు ప్రభుత్వం వుత్తర్వు పొందకుండా వచ్చినారని తెలియుచున్నది.

---

## లేఖలు

(19 వ పేజీ తరువాయి)

పుంఖములుగ గురిపించితిమి. ప్రయోజనము మాత్రము గలుగదయ్యె. పై వారి వ్రాతలను విమర్శించుటకై మనము వినియోగించిన కాలమును సరియగు పద్ధతులపై సంఘ కార్య క్రమమును నడుపు నాలోచనకే వినియోగించి యున్న ఉద్యమము కట్టు దిట్టములతో నడచి మంచి ప్రకటన ద్వారా ప్రసిద్ధికెక్కి ఒక్క క్రియకు రెండు ఫలితములు మనకు చిక్కి యుండెడివి.

ఇప్పటికి మించిపోయినది లేదు. సంఘ శక్తి నెరిగియున్న మనము సంఘలక్ష్యమును గ్రహించి దానిని సాధించుటకు పూనుకొనవలెను. ఇందు నిమిత్తము వ్యక్తుల అభిమానములట్లుంచి ఆంధ్రదేశమున ప్రస్తుతమమలునందున్నట్టియు, నితర ప్రాంతముల ఆంధ్రుల యధీనమునందున్నట్టియు, గ్రంథాలయ, పఠనాలయములన్నియు ముందు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమున సభ్యులగు టవసరము. ఒక్క రూపాయి చందాతో ప్రతి గ్రంథాలయమును నిందు సభ్యత్వము నందవచ్చును. ఇందువలన నిప్పు డమలునందున్న గ్రంథాలయముల సంఖ్య తెలియుటయే గాక ఆం. దే. గ్రం. సంఘము నిజమగు ప్రాతినిధ్యమును గలిగి ఆంధ్రి గ్రింథాలయముల కవసరమగు సమస్యల చక్కబెట్టగల సామర్థ్యమును, పలుకుబడిని సంపాదించును. త్వరలో కూడనున్న సర్వ సభ్య సభయందు గ్రంథాలయముల ప్రతినిధు లెక్కువగ నుందురు. అప్పుడు వివిధ సంఘముల మధ్య నుండవలసిన సంబంధమును వాని వాని విధులను నిర్ణయించుటలో వీరి అనుభవమును నక్కరకు వచ్చును. సంఘనిర్మాణమున చేయవలసిన మార్పుల విషయమై ఆలోచించి తీర్మానించుటకును అప్పుడే చక్కని యదను. నూతన నిబంధనల ననుసరించి క్రొత్త కార్య వర్గమును తిరిగి ఎన్నుకొనుటయు చేయవచ్చును. ఈ జరుగవలసిన కార్యక్రమము నంతటిని నిబంధనల ప్రకారము చందాల చెల్లించిన సభ్యులు మాత్రమే నెరవేర్ప నర్హులు. అందువలన నుద్యమాభిమానులగు వ్యక్తులే గాక దేశమున గల ఆంధ్ర గ్రంథాలయము లన్నియు వెంటనే ఆంధ్రిదేశ గ్రింథాలయమున సభ్యులై తమ చందాల నీ క్రింది చిరునామా కందజేయ ప్రార్థన. అచ్చటచ్చట గల గ్రంథాలయ, పఠనాలయముల నుండి సభ్యత్వ రుసుముల వసూలు చేయుటలో జిల్లా, తాలూకా, పట్టణ గ్రంథాలయ సంఘములును తోడ్పడ గోరెదను.

కార్యస్థానము:

సేవాశ్రమము, పెదపాలెము
(Via) దుగ్గిరాల, గుంటూరుజిల్లా.

పా. నాగభూషణం
కార్యదర్శి
ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము.

---

సంవత్సర చందా 3—0—0
అర్ధ సంవత్సర చందా 1—10—0
విడి ప్రతి [ 24 పేజీలు ] అణా
నవశక్తి కార్యాలయం,
బెజవాడ.

# నవశక్తి

ADVERTISE IN NAVASAKTI
The Leading Telugu Socialist Weekly


# సాహిత్యం విప్లవానికి సాయపడుతుంది!

## ఆదర్శ గ్రంథ మండలి, యలమర్రు. (కృష్ణా జిల్లా)

కారల్ మార్క్సుది—కమ్యూనిష్టు కరపత్రం(నిషేధింపబడినది): లెనిన్ ది—సామ్రాజ్యవాదము (నిషేధింప బడినది): ఏంజిల్సుది—సామ్యవాద సిద్ధాంతాలు 0—2—0 : మాక్సింగోర్కీది— అమ్మ (నిషేధంపోయింది) 1—8—0 : క్రోపాటకిన్ ది—మనధనం (అయిపోయింది): టాలుస్టాయిది—కర్షకునికాలగతి 0—1—0 : తుమ్మల వారిది —కామ్రేడ్ డిమిట్రాఫ్ 0—2—0: లింగయ్యది—దేవీజోన్ (జీవితము) 0—8—0 : డివేలరా (జీవితము) 0—8—0 : వలసదేశాల సమస్య 0—1—0 : స్టాలిన్—ఎడ్విగ్‌తో సంభాషణ 0—1—6.

## నవ్యసాహిత్యమాల, అనంతపురం.

1. ఫాసిజం 0—8—0 2. లెనిన్ 0—8—0 3. ఆస్ట్రియా 0—1—0 4. 1937 లో మాస్కో : 0—8—0

అందమైన గెటప్‌తో, అందరికీ అర్థమయ్యే సులభశైలితో, అందరికీ అందుబాటులో ఉండే వెలలతో, వెలువడినాయి. పత్రికలూ, ప్రముఖులూ ఈ పుస్తకాలనుగూర్చి సదభిప్రాయాలిచ్చారు.

## విశ్వసాహిత్యమాల, ముంగండ, (via.) అంబాజీపేట, తూ. గోదావరి.

లెనిన్ ఉపదేశాలు: వెల 6 అణాలు (పామిదత్తు రచన కనువాదము). పారిస్ కమ్యూన్: వెల 6 అణాలు (లెనిన్ రచన కనువాదము). సోషలిజం ఎందుకు 1—0—0 నా రష్యాయాత్ర 0—8—0. సోవియట్ కమ్యూనిజం 0—5—0. 1905 రష్యా విప్లవం (నిషేధింపబడినది.) కారల్ మార్క్సు ఉపదేశాలు (నిషేధింపబడినది.)

నాడు-నేడు గ్రంధకర్త: అదయాంకో వెల 1—4—0 500 పుటలు—చక్కని బైండు—మంచి గెటప్.

పెట్టుబడిదారీ విధానంలో నాడు - సోషలిస్టు విధానంలో నేడు రష్యాలోని శ్రామికవర్గం యొక్క స్థితి ఏలాగవుంది? పెట్టుబడిదారీ విధానం—సామ్రాజ్యవాద యుద్ధం కారణంగా దిక్కూ - ఆధారమూ లేకుండా తయారయిన వేలకొలదిమంది అనాధ బాలురకి విప్లవం ఇచ్చిన సుఖం ఏమిటి? గ్రంథకర్త స్వయంగా ఒక అనాధ బాలుడు అవడం ఈ నవల యొక్క ఔన్నత్యానికి ముఖ్య కారణం.

## ప్రొలిటేరియన్ సీరీస్

**అన్నా.** జర్మనీలో కార్మికులు, కమ్యూనిస్టులు సల్పిన పోరాటం—త్యాగం—విప్లవం—కనులకు కనబడేటట్లు చిత్రించాడు నవలాకరుడు. అన్నా'లో, అశ్వనీకుమార్ దత్తుగారు మంచి రసవంతంగా అనువదించి, ఆంధ్రులకు అందించారు. ఇలాంటి వీరగాథను చదవండి: ధన్యులుగండి: 300 పేజీలు. అర్థరూపాయే సుమా: మీ కాపీకి వెంటనే ఆర్డరు యివ్వండి. ఏజన్సీ కావలసినవారు అనా విక్లిపోవాయండి. పుస్తకము కావలసినవారు పది అణాల ఆరు పైసలు తపాలా బిళ్లలు పంపించండి.

దర్శా శ్రీరామమూర్తి, న్యూస్ ఏజంటు, భీమవరం; పశ్చిమ గోదావరి.

## నవశక్తి కార్యాలయం, బెజవాడ.

మాస్కో తిరుగుబాటు, వెల ఒక అణా. భారత కార్మికోద్యమ చరిత్ర. వెల 0—4—0 గ్రంధకర్త: తుమ్మల వెంకట్రామయ్య.

నిర్మాణ సమస్యలు, వెల 0—1—0. గ్రంధకర్త:-పుచ్చలపల్లి సుందరయ్య

## అతివాద గ్రంథమండలి, గుంటూరు.

1922 మన్యంలో రైతుల తిరుగుబాటు (అల్లూరి సీతారామరాజు) (నిషేధింపబడింది). విలువ, ఖరీదు, లాభము. (అచ్చులో ఉంది.)

స్టాలిన్ ఉపన్యాసము—నూతన రాజ్యాంగవిధానం. 0-5-0 ఇతరులకు 0-8-0.

## హిందీ పత్రికలు.

**జనతా** సోషలిస్టు వార పత్రిక. బీహారు రాష్ట్రంలో స్వామి సహజానందుని నాయకత్వం క్రింద జరిగే రైతు ఉద్యమాన్ని గూర్చి తెలుసుకోవాలంటే దీనిని చదువాలి. సం॥ చందా రు 3-0-0. మేనేజరు, జనతా బంకిపూరు, పాట్నా.

**నయా హిందూస్తాన్** సోషలిస్టు పక్ష పత్రిక. సంపాదకుడు : సయ్యద్ జహీర్. 'నయా హిందూస్థాన్,' కార్మిక కర్షక పోరాటాలను వృద్ధి చేస్తుంది. తీవ్ర వాదుల, సోషలిస్టుల అందరియొక్క ఐక్యతకు నాయకమణి. అక్టోబరు ౧వ తేదీనుండి వెలువడుతుంది. విఖ్యాత సోషలిస్టుల, రచయితల వ్యాసాలు ఉంటాయి. ఇపుడే చందాదారులు కండి: సంవత్సరం చందా రు. 2-0-0. మేనేజరు నయా హిందుస్థాన్, 90. జీరో రోడ్డు, అల్హాబాదు.




Printed, and Published by M. Annapurniah at Navasakti Press, Governorpet, Bezwada

